JAGATI Rs. 2-00 September 1992

37th Year of Publication




434

సెప్టెంబరు - 1992

## సాహితీ సుధ

ఖలులగు వారలం దురధికార సమర్థుల జేసి తా నిర
ర్గళ గతియై నికృష్ట నిజకర్మము విస్మృతి పాలొనర్చి ని
శ్చలగుణ వైరియై విధి వశంబున సంపద గాంచి త్రుళ్లుమన్
మెలగు నృపాలు దేశమున మేలు లభించునె యెట్టి వారికిన్

—భర్తృహరి

కంటికి నిద్రవచ్చునె ? సుఖంబగునే రతికేళి ? జిహ్వకున్
వంటక మిందునే ? యితర వైభవముల్ పదివేలు మానసం
బంటునె ? మానుషంబు గల యట్టి మనుష్యున కెట్టివానికిన్
గంటకుడైన శాత్రవు డొకండు దనంతటి వాడు గల్గినన్

—శ్రీవాధుని 'భీమఖండం'

నీరే ప్రాణాధారము - నోరే రసభరితమైన నుడువుల కెల్లన్
నారే నరులకు రత్నము - చీరే శృంగారమండ్రు సిద్ధము సుమతీ

—సుమతీ శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు : అ॥ డాలర్లు 75.
ముఖచిత్రం : రాధాకృష్ణన్

# నిమిషాలు

చాలా సంవత్సరాల తర్వాత బ్రహ్మానందం మేష్టారు, తన పూర్వ విద్యార్థి ప్రసాద్ బాబుని కలుసుకున్నాడు.

'బాగా పొడుగయావు - పెద్దవాడి వయావు'

'పన్నెండేళ్లయింది, సార్. నన్ను గడకర్రలా వున్నావనేవారు మీరు.'

'అవును - మీ తమ్ముడు పిప్పళ్ల బస్తాలా వుండేవాడు. కసరత్తు చేసి, వొళ్లు తగ్గించుకున్నాడా ?'

'లేదు, సార్. వ్యాయామం ప్రారంభించాక, అకలి ఎక్కువై. యింకా వొళ్లు చేశాడు' - అన్నాడు ప్రసాద్‌బాబు.

'కొందరి తీరు అంతేలే - మన మేమీ చేయలేము.... మీ యిద్దరికీ లెక్కలలో సున్నాలు వచ్చేవి - అది మాత్రం నాకు బాగా జ్ఞాపకం. కొంద రికి లెక్కలు రావు - వాళ్లఖర్మ' - అన్నాడు బ్రహ్మానందం.

'ఎప్పుడూ సున్నాలు వచ్చేవని మా నాన్న నన్ను కోడిగుడ్ల వ్యాపా రంలో పెట్టాడు, సార్'

'మంచిపని జేశాడు, మరి మీ తమ్ముడిని ?'

'వడపూడి నారింజకాయల వ్యాపా రంలో.'

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

నీ వ్యవహారమేమీ బాగాలేదు - అని రిమార్కు చేశాడు గిరిధరరావు.

'ఏ విషయంలో ?' - అని అడి గాడు శ్యామలరావు.

'ఆ సుశీలని రెండు సంవత్స రాలుగా ప్రేమించావు కదా ?'

'అవును'

'ఆ సుశీల ఎవరో తెలుసా ?'

'తెలుసు, మీ బాబాయి బావ మరిది కూతురు.'

'రెండు సంవత్సరాలుగా ప్రేమించి, సినిమాలకు షికార్లకు తిరిగి, యిప్పుడు మొహం చాటేస్తే, ఆ అమ్మాయి ఏమవుతుంది ?'

'నేనేమీ మొహం చాటేయలేదు - స్పష్టంగా చెప్పాను పెళ్లికుదరదని,'- అన్నాడు శ్యామలరావు.

'అసలెందుకు ప్రేమించావు ?'

'ఒక్కతే కూతురు - అన్న దమ్ములూ అక్కచెల్లెళ్లూ లేరని.'

'అది నిజమేకద !' - అని తిరిగి ప్రశ్నించాడు గిరిధరరావు.

'వాళ్లు వుంటున్నది స్వంత యిల్లు అనుకున్నాను - అద్దె యిల్లు అని నాకు ముందు చెప్పొద్దూ!'

—పియమ్ సుందర్రావు
విజయవాడ-8

'తను ఎక్కుతాడట.'

'ఓస్, యింతేకదా - కాసేపు వీపు ఎక్కించుకుంటే పోలే....!'

—ఆర్ నాగమణి
రాజమండ్రి-2

రిటైరయాక పిల్లల్ని సముదాయించడం నేర్చుకోకపోతే ఎలా? కూతురింట్లోవున్నా, కోడలింట్లోవున్నా, పసివాళ్లని చూస్తామనే కదా, మనని అంతగా రమ్మని 'బతిమాలటం. ఎందుకండీ రవిగాడలా ఏడుస్తున్నాడు?' - అంది లక్ష్మీకాంతమ్మ.

'వాడిందాక టివిలో గాడిదను చూశాడు - ఆఫ్రికా జీబ్రాలు చూపించారు. వాడికి యిప్పుడు గాడిద కావాలట,' - అన్నాడు లక్ష్మీకాంతమ్మ భర్త పద్మనాభం.

'గాడిద కావాలంటే - అది ఏంచేసు కుంటావ్, వెనక కాళ్లతో తంతుంది, చారల గాడిదలు మనదేశంలో వుండవు - యిలాంటివన్నీ నెమ్మదిగా చెప్పాలి.'

'నీవు వచ్చి చెప్పకూడదూ?'

'కూర మాడిపోతుందండీ - లేకపోతే, నేనే సముదాయించి వుందును. ఇంతకీ గాడిద దేనికట?'

ఇద్దరు మిత్రులు తమ ధైర్య సాహసాలు చెప్పుకుంటున్నారు.

'పోయిన నెల శ్రీశైలం కాంపుకి వెళ్లినప్పుడు యద్వాంచరస్‌గా చిట్టడివిలోకి వెళ్లాను. నమ్ముతావో నమ్మవో ఒక సింహం ఎదురొచ్చింది. చేతిలో కనీసం బొమ్మతుపాకి కూడా లేదు. ఆత్మ స్థైర్యంతో ధీమాగా నిలబడి వాటర్ బాటిల్లోని నీరు అరచేతిలో పోసుకు, మంత్రించి, దాని మొహం మీద చల్లాను. తోక ముడుచుకు వెళ్లిపోయింది' - అన్నాడు రంగనాధం.

'నేనూ ఆరోజున అదే అడవిలో ఉన్నాను, బ్రదర్, ఓహో, నీవు చల్లినదా అది? తిన్నగా నా దగ్గిరి కొచ్చి, నాజేబురుమాలుతో నీరు తుడిపించుకు వెళ్లిపోయింది' - అన్నాడు రాజారావు.

—కె. వెంకటరామ్
పామర్రు

# పాఠకుల తీర్పు

రాజశ్రీ చందూర్‌గారికి : 'సాహితీ సుధ' శీర్షికలో మంచి పద్యాలను ఏరి వేస్తున్నారు. కాని పద్యాన్ని చదివి, దానిలోని అర్థాన్ని తెలుసుకొని, పూర్తి ఆకళింపు చేసుకొనే అవకాశము లేకుండా పోతూంది. కనుక అర్థాన్ని, వ్యాఖ్యానాన్ని జోడిస్తే బాగుంటుందని మనవి.

—సిహెచ్ శ్రీనివాసులు
కొడుమూరు

శ్రీయుత చందూర్ గారికి వందనములతో : 'జూలియస్' ధారావాహికకు 'ముందుమాట' చక్కగా చిక్కగా, గతస్మృతులను, సన్నివేశాలను 'మనసు - తెర'పై ఆసక్తిదాయకముగా వీక్షించుటకు అవకాశం కల్పించినందుకు హృదయ పూర్వక ధన్యవాదములు, ఎదుట వ్యక్తితో సరళంగా మాట్లాడు నటువంటి 'నెరేషన్' ఆప్యాయతతో కూడుకొని, కళ్లు చెమర్చ జేసిందంటే అతిశయోక్తి కాదు : అన్నపూర్ణారెడ్డి దంపతుల ఎడ మీరు, మాలతీ చందూర్‌గారు, శారదమ్మగారు చూపుచున్న ఆదరాను రాగాలు సాటిలేనివి.

—డా॥ యమ్వీరెడ్డి
నేలమంగళ-కర్ణాటక

చందూర్‌గారూ నమస్తే. స్నేహితులూ, అభిమానులూ రావడం, అరగంటా గంటా కబుర్లాడటం మీకు అనుదినపు అనుభవమే గావచ్చుగాని, సాధారణంగా కనిపించే అసాధారణ వ్యక్తులతో సంభాషించటం నాలాంటి వాళ్లకు - Once in a Blue Moon గాని సాధ్యపడదు. అంచేత, 1992 జూన్ 3వ తేదీ సాయింత్రం, నేను మరచిపోవాలన్నా మరపురాదు - థాంక్స్.... పదిన్నర హౌరామెయిలు అడ్డంరాని పక్షంలో మరి కాసేపు గడిపగలిగేవాడిని – ప్రాప్తం లేదు .... మాలతి గారికి మా నమస్కారము లందజేయండి.

—అమరేంద్ర
న్యూఢిల్లీ

మిత్రులు చందూర్ గారికి నమస్కారములతో.... శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడిగారి 'నా రాట్నచక్రం' లోని సన్నివేశములు ఎంతో హృద్యంగా బాగున్నాయి. ఆ మహనీయుని అప్పుడప్పుడు వాగల్లు ఆశ్రమంలో చూచే భాగ్యం కలిగిందని ఆనందిస్తున్నాను ఈనాడు.

—పియల్ నరసింహమూర్తి
మద్రాసు-93

# వెన్నెల కెరటాలు

## ఏడాది పాలన

ప్రతికూలతల మధ్య పివి గద్దె నెక్కాడు. ఆయన ప్రమాణ స్వీకారోత్సవం నాడే పదవీకాలం లెక్కలు వేశారు రాజకీయ పరిశీలకులు .. తనది మైనారిటి ప్రభుత్వమనే అభిప్రాయం ప్రజలకు ఏమాత్రం కల్గకుండా వ్యవహరించాడు. ఏకాభిప్రాయ సాధనా సూత్రంతో ప్రతిపక్షాలను మంచిచేసుకొని, పలు సమస్యలు నివారించాడు. తిరుపతి ప్లీనరీ ద్వారా పార్టీలో తనకు తిరుగులేని అధికారం వుందని ప్రపంచానికి చాటాడు. అన్నిటికి మించి రెండింట మూడు వంతుల మెజారిటీ వున్న రాజీవ్ గాంధీ సైతం సాహసించలేని సంచలనాత్మక విధాన నిర్ణయాలతో ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలనే మార్చివేశాడు. ఏడాది క్రితం అప్పుల భారంతో దివాలా తీసి వుండిన దేశాన్ని గట్టెక్కించాడు. రెండువేల కోట్లకు పడిపోయిన విదేశీ మారక ద్రవ్య నిల్వలను 15 వేల కోట్లకు పెంచాడు.... వ్యక్తిగతంగా, రాజకీయంగా బలహీనుడైన నాయకుడు మైనారిటి ప్రభుత్వ నిర్వహణ చేస్తూ ఇన్ని విజయాలు సాధించడం సాధారణ విషయం కాదు. ఆ ఘనత పివి ఒక్కడికే దక్కుతుంది. దేశంలో అత్యున్నత పదవిలో వున్నప్పటికి ఒక తాత్వికుడివలె, వేదాంతి వలె, సర్వ సంగ పరిత్యాగి వలె ప్రవర్తించడం వల్లనే పివి ఈ ఘనతను సాధించ గల్గాడు.. నిప్పులాంటి నిజాయితీయే పివికి శ్రీరామ రక్ష.

—సంపాదకీయం
'జమీన్ రైతు'

## కేరక్టర్ పాత్ర

1965లో ప్రసిద్ధ దర్శకులు కె. ప్రత్యగాత్మగారు కృష్ణంరాజు గారిని హీరోగా పరిచయ చేస్తూ, కృష్ణకుమారి కథా నాయికగా 'చిలకా - గోరింకా' చిత్రాన్ని నిర్మించే సన్నాహాల్లో వున్నారు. ఆ సమయంలో - సత్తిరాజు గారు - నన్ను ప్రత్యగాత్మగారి వద్దకు తీసుకెళ్లి పరిచయం చేశారు. కృష్ణంరాజుగారి చెల్లెలి పాత్రకు నన్ను ఎన్నుకున్నారు. సినిమా రంగానికి నేనూ - కృష్ణంరాజుగారూ కొత్తే! 28 సంవత్సరాలుగా 'కేరక్టర్' నటిగా పరిశ్రమలో కొనసాగుతున్నాను. కథానాయిక పాత్రలు ఒక వయసు వరకే పరిమితం. 'కేరక్టర్ పాత్రలో' అలా కాదు.

—రమాప్రభ
'విజయచిత్ర'లో



# పాతికేళ్ల నాటి పిక్చర్



## పి పుల్లయ్య దర్శకత్వంలో 'భామా విజయం'

అందమైన భూలోక కాంతలకి, అందని లోకాల అప్సరసలకి, వైరం కల్పించడం ద్వారా, ప్రబంధయుగం నాటినుంచీ జానపదగాథలు, తన కల్పనా పటిమతో, శ్రోతలని, పాఠకులని, ప్రేక్షకులని ఆకట్టుకుంటున్నాయి. ఒకరికి మంత్ర తంత్ర శక్తులు ఉంటాయి; మరొకరు రక్త మాంసాలు గల మామూలు మనుషులు. ఈ అతీత శక్తుల వారిలో కూడా మళ్లీ మంచివాళ్లూ, చెడ్డవాళ్లూ ఉంటారు. గాలిలో ఎగరాలనే అంతః ప్రేరణే 'కీలుగుర్రమై' సామాన్య ప్రేక్షకుని ఎంతో సంతోష పెట్టింది .... 'భూపతి జంపితిన్ మగడు భూరి భుజంగము చేత జచ్చె నేనాపద జెంది జెంది యుదయార్కుని పట్నము జేరి వేశ్యనై .. పట్టి విటుండ్తైరాగ .... ఈ గతి గొల్లభామనై....' అని చెప్పుకుంటుంది ఒక భామామణి మన చాటువుల్లో .... సలక్షణంగా వున్న ఒక యువరాజు, సంప్రదాయం పక్కకు నెట్టి, ఒక సామాన్య యువతిని ప్రేమిస్తాడు. రాజులు తాము ప్రేమించిన కాంత లందరినీ పెళ్లి చేసుకోరు. కాని, ఈ యువరాజు మాత్రం ఆ ప్రేమించిన యువతినే పెళ్లి చేసుకుంటాడు. ఆ తర్వాత మొదటి రాత్రి. పుష్ప పరిమళాల మధ్య, పరవళ్లు తొక్కే ప్రేమ పాటలతో, ఆ జంట హృదయాల అనురాగ సుధ, వెన్నెలవాగులో తన్మయత్వ మొందుతున్న వేళ ఒక గంధర్వ కాంతకు ఆ యువరాజుపై మనసు కలుగుతుంది. ఈ దేవకాంతలు తాము కోరినది పొందేదాకా నిద్ర పోరు. వరూధిని సైతం మాయా ప్రవరాఖ్యుడే నిజ ప్రవరాఖ్యుడనుకొని తృప్తిపడింది. అలాగే ఈ గంధర్వ కాంత కూడా నాగిని (పాము) రూపం దాల్చి, యువరాజుని కాటేసి, అతనికి స్పృహ తప్పాక, తమ లోకానికి పట్టుకుపోతుంది. అక్కడ కొందరి అనుగ్రహం వల్ల, ఈయన గారు తన భార్యని కలుసుకోగలుగుతాడు. కాల గతితో ఆ సామాన్య యువతి గొల్ల భామగా మారి వెనకటి గాథ చెబుతుంది. యన్.టి రామారావు, దేవిక, యల్ విజయలక్ష్మి, రేలంగి, గిరిజ, విజయనిర్మల మున్నగు వారున్నారు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - సెప్టెంబరు 1967



## మానవ ప్రగతి

### సాహసే లక్ష్మి

'అపోలో' వ్యోమగాములు చంద్రుడి మీద నడిచి వచ్చిన తర్వాత మళ్లీ అంతరిక్షంలో అంతటి సాహసకృత్యం ఒకటి ఇటీవల జరిగింది. అమెరికన్ రోదసీ విమానం (స్పేస్‌షటిల్) 'ఎండెవర్' లోని వ్యోమగాములు మే నెల రెండవ వారంలో, తమ వ్యోమయాత్ర సందర్భంగా ప్రాణాలకు తెగించి అంతరిక్షంలో 'నడుచుకుంటూ' వెళ్లి ఒక కమ్యూనికేషన్ల ఉపగ్రహాన్ని 'రక్షించిన' సంఘటన అంతరిక్ష పరిశోధనల చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని తెరిచింది ఈ సాహస కృత్యంలో పాల్గొన్న వ్యోమగాములను అంతరిక్షంలోనికి తీసుకు వెళ్లిన అమెరికన్ స్పేస్‌షటిల్ 'ఎండెవర్' కి ఇది మొట్టమొదటి యాత్ర కావడం విశేషం. ఆరేళ్ల క్రితం ప్రేలిపోయిన స్పేస్‌షటిల్ 'ఛాలంజర్' స్థానంలో అమెరికా 'ఎండెవర్'ని ప్రవేశపెట్టింది. రోదసిలో నడుచుకుంటూ వెళ్లిన ముగ్గురు వ్యోమగాములు కక్ష్యలో తిరుగుతున్న ఉపగ్రహాన్ని పట్టుకున్న సంఘటన 'నాసా' చరిత్రలో ఒక క్రొత్త యుగానికి నాంది పలికిందని 'నాసా' అంటున్నారు. అనేక మంది టెలివిజన్ తెరలమీద వీక్షిస్తుండగా ఎండెవర్ వ్యోమగాములు ఒక అసాధ్యాన్ని సుసాధ్యం చేశారని, ఈ ఉత్తేజంతో ఇప్పుడు తిరిగి చంద్రుని పైకి మనిషిని.... ఈ సారి అక్కడ స్థిర నివాసం ఏర్పరచుకునేందుకు.... పంపించడానికి: అలాగే మనిషిని అంగారక గ్రహం (మార్స్) పైకి పంపడానికి కూడా ప్రయత్నిస్తామని అంటున్నారు. 8 గంటల 29 నిమిషాల 'అతిసుదీర్ఘమైన' స్పేస్‌వాక్ అనంతరం 'ఎండెవర్' వ్యోమగాములైన పియరీ థువాట్, రిచర్డ్ హీబ్, థామస్ అకెర్స్ 15 కోట్ల 70 లక్షల డాలర్ల విలువైన కమ్యూనికేషన్ల ఉపగ్రహాన్ని పట్టుకుని, దాని లోపాన్ని సవరించి మళ్లీ దానిని కక్ష్యలో ప్రవేశపెట్టారు. లోగడ 'అపోలో' వ్యోమగాములైన యూజీన్ సెర్నాన్, హారిసన్ షెమిడ్ 7 గంటల 37 నిమిషాల పాటు చంద్రుని మీద నడిచి

స్థాపించిన 'అమెరికన్ రికార్డు' ను 'ఎండెవర్' వ్యోమగాములు తమ 8 గంటల 29 నిమిషాల నడకతో అధిగమించారు. దీనితో పాటు.... ముగ్గురు వ్యోమగాములు ఏకకాలంలో అంతరిక్షంలో నడిచిన తొలి సంఘటనగా కూడా 'ఎండెవర్' అంతరిక్ష యాత్రికుల సాహసకృత్యం చరిత్రలో విశిష్టస్థానం సంపాదించుకుంది. కక్ష్యలో తిరుగుతున్న ఉపగ్రహాన్ని పట్టుకున్న వ్యోమగాములు దానికి ఒక క్రొత్త రాకెట్ మోటార్‌ని అమర్చి దాని సహాయంతో ఉపగ్రహాన్ని భూమికి 35,680 కిలోమీటర్ల ఎత్తున గల స్థిర కక్ష్యలోనికి పంపగలిగారు. అక్కడి నుంచి ఈ ఉపగ్రహం అంతార్జాతీయ టెలికమ్యూనికేషన్ల ఉపగ్రహ సంస్థ కోసం టెలిఫోన్, టెలివిజన్ సంకేతాలను 'రిలే' చేస్తుంది. 'ఎండెవర్' వ్యోమగాముల ప్రయత్నానికి పూర్వం ఈ ఉపగ్రహం రెండేళ్ల క్రితం ఏర్పడిన ఒక 'రాకెట్ లోపం' వల్ల ప్రయోజనరహితమైన దిగువ కక్ష్యలో వుండిపోయింది. అంతరిక్షంలో అద్భుత సాహసం చేసిన 'ఎండెవర్' వ్యోమగాములు కాలిఫోర్నియాలోని ఎడ్వర్డ్స్ వైమానికదళ స్థావరం వద్ద మళ్ళీ భూమి మీదికి దిగినప్పుడు దాదాపు లక్ష మంది ప్రజలు ఘనస్వాగతం పలికారు....

(అమెరికా సమాచార శాఖ

## కాకినాడలో

గత మూడు దశాబ్దాలుగా పడవల నిర్మాణానికి ప్రసిద్ధిగాంచిన తూర్పు తీర ప్రాంత మేది అని ఎవరైనా అడిగితే సరియైన సమాధానాన్ని చాలా కొద్ది మంది మాత్రమే చెప్ప గలుతారు. సుందర గోదావరీ తీరంలోని కాకినాడ రేవు! అతి చౌకలయిన కేటమరాన్ అయినా సరే, లేదా, గట్టిప్లాస్టిక్‌తో నిర్మించిన ట్రాలర్ అయినా సరె లేదా పర్యాటకుల మానసి కోల్లాసాన్ని మరింత పెంపొందించే అధునాతన పడవ అయినా సరే, పూర్వం నుండి మనకు సగర్వ వారసత్వంగా సంక్రమిస్తున్న పడవ నిర్మాణ బాధ్యతను తలకెత్తుకుని, వివిధ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఆవశ్యకతలను విజయవంతంగా పూర్తి చేస్తున్నారు. భారత దేశంలోనే మొట్టమొదటి ట్రాలర్ నమూనాను రూపొందించి పటిష్టంగా నిర్మించి వేనోళ్ళ ప్రశంసలందుకున్న పనితనం ఈ కేంద్రానిది. 1959లో తన కార్యకలాపాలను ఈ యార్డు ప్రారంభించి... 1000 కిలోమీటర్ల సుదీర్ఘ తీర ప్రాంతం మన రాష్ట్రానికి. చేపలు పట్టడానికి ఎంతో అవకాశాన్ని కల్పించడంతో లక్షలాది మత్స్యకారుల అవసరాలకు తగినట్లుగా ఈ కేంద్రంలో పడవ నిర్మాణ చాతుర్యం రాటు దేలింది. ప్రారంభించిన 10 సం॥లలోనే ఈ కేంద్రం 600 బోట్లను రూపొందించి, మన

రాష్ట్రంతో పాటు, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, పాండిచ్చేరి, భారత ప్రభుత్వాలకు అందచేసింది. మొదట్లో ఈ బోట్లన్నీ చెక్కతోనే తయారయేవి. క్రమంగా ఈ నిర్మాణ సామగ్రితో పాటు ట్రాలర్ పొడవు కూడా 10 అడుగుల నుండి 23 మీటర్ల సాయికి మారింది. 10 అశ్వశక్తి నుండి 400 అశ్వశక్తి వరంలో చేపలు పట్టే మర పడవలు, సాధారణ పడవలు అనేక రకాలు తయారవసాగాయి. మన రాష్ట్ర తీర ప్రాంతంలో దాదాపు ఎనిమిది లక్షల మంది మత్స్యకారులు చేపల వేటే జీవనాదారంగా బతుకుతున్నారు. ఈ రంగంలో 40,000ల వరకు వివిధ రకాల నావలు, బల్లకట్లు ఉన్నాయి. ఈ కేంద్రంలో రీఇన్‌ఫోర్స్‌డ్ ప్లాస్టిక్ (జి. ఆర్ పి.) పడవ నిర్మాణం 1985లో ప్రారంభమైంది. అప్పటి నుండి 500లకు పైగా ఈ జి.ఆర్.పి. పడవలు నిర్మించబడి వివిధ వినియోగ దారులకు అందజేయబడ్డాయి. ఈ సంస్థ సంవత్సరానికి 160 జి. ఆర్. పి. బోట్లను నిర్మించగల సామర్ధ్యం కలిగి ఉంది. కాకినాడ యార్డు భారత నౌకాదళానికి స్పీడు బోట్లను కూడ సరఫరా చేస్తున్నది. ఈ యార్డు, పర్యాటక విభాగం కోసం పెడల్ బోట్లు, విహారనౌకలు, స్పీడు బోట్లు వంటి వాటి నిర్మాణంలో కూడ విశేష ప్రగతి సాధించింది.

(ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## స్వావలంబన

భారతీయ ప్రభుత్వ ఆర్థిక, పారిశ్రామిక విధానాలు ఖాదీ గ్రామోద్యోగ సంస్థలనే కాకుండా దేశం మొత్తాన్ని మున్నెన్నడూ లేనంతటి కష్టాలో ముంచాయి. ఖాదీ పెటుబడులు, రాయితీల పేరుతో ఖాదీ గ్రామోద్యోగ పంస్థలను కట్టడి చేస్తున్నవి. గ్రామోద్యోగసిద్ధాంతానికి వ్యతిరేకంగా ఎన్నో విషయాలను ఖాదీ గ్రామోద్యోగ కమిషన్ తన పరిధిలోకి చేర్చుకొంటున్నది. ఖాదీ, గ్రామీణ పరిశ్రమలు క్రొత్త వ్యక్తులకు శిక్షణ నివ్వడం తగ్గించి ఎక్కువ మంది కార్మికులను చేర్చుకొంటున్నది. అధిక పెట్టుబడుల వలన వడ్డీ బరువు ఎక్కువై అవ ప్రభుత్వం చేతిలో బందీ అవుతున్నవి. ప్రభుత్వం ఖాదీ గ్రామీణ పరిశ్రమల వ్యవస్థను నిర్వీర్యపరచకుండా ఉండాలి. ఇందులో పనిచేసే కార్యకర్తలు తమ ప్రస్తుత పరిస్థితి దేశంలోని క్లిష్ట పరిస్థితిలో భాగమే నని గ్రహించి విదేశీ వస్తువుల బహిష్కారము వంటి పనులు చేపట్టాలి. స్వావలంబన కొరకు గ్రామ ప్రజలకు చక్కపరచడం అత్యవసరం. చేనేత, సబ్బులు, పాదరక్షల తయారీ, మత, భాషా, ప్రాంత విబేధాలు లేకుండా జరగాలి.

(సర్వోదయ ప్రెస్ సర్వీస్



# ?

"As Hanuman entered Lanka, could he go straight to Seeta?" asked Raghu.

"How could he? He didn't know how she looked like. He had to make a strenuous effort to ascertain her identity Presuming her to be a captive in the royal household, Hanuman went to the palace and into the sleeping chamber and was amazed and impressed by Ravana's majesty and commanding appearance but regretted that he had fallen into bad ways. Hanuman was at a loss to know the whereabouts of Seeta. Here we find a bit of suspense with a nice twist," said Raghu's Father.

"Suspense? What suspense could there be?" was Raghu's query.

"Suspense not to us but to Hanuman. Till then he was an embodiment of self-discipline and self-determination. Suddenly it occurred to him they were not enough. So, he sat down in prayer and begged the Supreme to grant him guidance in successful accomplishment of *Rama Karya*. From the palace wall he jumped on to a nearby tree and thereon to Ashokvan where Seeta looked like a glittering jewel under the shade of a tree. And his next job was to convince her that he was an emissary from Rama."

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



# క్రొత్త పుస్తకాలు

AMARAJEEVI POTTI SREE RAMULU 90 th JAYANTI SOUVENIR, 1992 Published by Amarajeevi Potti Sree Ramulu Memorial Society, Potti Sree Ramulu Memorial Building, 126 R H Road, Mylapore, Madras-600 004 .. Price : Rs. 200-00.

అమరజీవి పొట్టి శ్రీ రా ము లు స్మారక సంఘం వారు వెలువరించిన అమరజీవి పొట్టి శ్రీరాములుగారి తొంభయ్యవ జయంతి ప్రత్యేక సంచిక సంపాదక మండలిలో: డా క్టర్ ఆరుద్ర, శ్రీమతి మాలతీ చందూర్, శ్రీ బి.ఎస్.ఆర్. కృష్ణ, శ్రీ వై.ఎస్. శాస్త్రిగార్లు ఉన్నారు. ప్రత్యేక సంచిక సంపాదకులు : శ్రీ వై.ఎస్. శాస్త్రి, శ్రీ మల్లిక్ గార్లు.

ప్రత్యేక సంచిక తొలిభాగం ఆంగ్లంలోనూ మలిభాగం తెలుగులోనూ ఉన్నాయి.

విషయానుక్రమణిక వెనువెంటనే మహాత్మా గాంధీజీ ఛాయాచిత్రం, ఆ వెనుక మా గోఖలే గారు చిత్రించిన 'అమరజీవికి వందనం' అనే చిత్రం ఉన్నాయి. ఆ వెంటనే పొట్టి శ్రీ రాములు గారి వర్ణ చిత్రం ఉంది. ఆ చిత్రం మీద శ్రీరాములుగారి పేరు ఆంగ్లంలో మాత్రమే ఉండడం – అంత సబబుగా లేదు.

పొట్టి శ్రీరాములుగారి స్మారక మందిరంలో జరిగిన వివిధ కార్యక్రమాలకు సంబంధించిన ఛాయా చిత్రాలు ఎన్నో - ఈ సంచిక ఆద్యంతమూ కనిపిస్తాయి.

అమరజీవి శ్రీరాములుగారి గురించీ ఆయన నిస్వార్థ జీవితాన్ని గురించీ తెలియజేయడమే ఈ సంచిక ప్రధానాశయం అని పేర్కొన్నారు - అమరజీవి స్మారక సంఘం అధ్యక్షులు ఆచార్య ఎం. శాంతప్పగారు ఆంగ్లంలో వ్రాసిన తమ ముందుమాటలో. సంఘం గౌరవ కార్యదర్శి శ్రీ వై.ఎస్. శాస్త్రిగారు తమ ఉపోద్ఘాతంలో ప్రత్యేక సంచిక రూపొందిన తీరు గురించి వివరించారు.

ఈ ప్రత్యేక సంచికలో - అమరజీవి శ్రీరాములు గారి జీవితాన్నీ ఆయన అసమాన త్యాగాన్నీ వివరించే వ్యాసాలూ, తెలుగు వారికీ చెన్నపురికీ గల చారిత్రక సంబంధాల గురించి తెలియజేసే వ్యాసాలూ, అమరజీవి స్మారక సంఘం వారు ఏర్పాటుచేసిన స్మారకోపన్యాసాలలో కొన్నీ ఉన్నాయి. ఇవికాక - దాక్షిణాత్య సంస్కృతి

వికాసంలో తెలుగు వారి పాత్రనూ తెలుగు తమిళ ప్రజల సంబంధ బాంధవ్యాలనూ తెలుగు వారి కళాభిజ్ఞత నూ సాహిత్య ప్రశస్తినీ వివరించే వ్యాసాలూ ఉన్నాయి.

ఆంగ్ల విభాగంలో మొదట వై.ఎస్. శాస్త్రి గారి చిన్న వ్యాసం పొట్టి శ్రీ రాములు గారి జీవిత విశేషాలను క్లుప్తంగానూ ఆసక్తికరంగానూ వివరిస్తుంది. శ్రీరాములు గారి గురించిన తక్కిన వ్యాసాలలో శ్రీ వి. రాధా కృష్ణ గారు వ్రాసిన 'ది గ్రేట్ పొట్టి శ్రీరాములు'లో - శ్రీరాములు గారు మనిషిగా బలహీనులయినా ఆయన పట్టుదల ఎంతో బలమయిందని పేర్కొన్నారు.

'పొట్టి శ్రీరాములు ఫ్రమ్ సంచాలక్ ఆఫ్ గాంధీ స్మారక్ నిధి టు ఫాదర్ ఆఫ్ లింగ్విస్టిక్ డెమోక్రసీ ఇన్ ఇండియా' (Potti Sri Ramulu from Sanchalak of Gandhi Smarak Nidhi to Father of Linguistic Democracy in India) అనే వ్యాసంలో శ్రీరాములు గారి జీవితంలో వచ్చిన మార్పుల గురించీ, ఆయన ప్రత్యేకతల గురించీ ఎన్నో వివరాలు ఉన్నాయి. ఈ వ్యాసంలో - ఆంధ్ర ప్రాంత గాంధీ స్మారక నిధి సంచాలకులుగా ఆయన చేసిన కృషిని వివరిస్తూ ఒక ఉదంతాన్ని ఉటంకించారు: నెల్లూరు జిల్లాలో మడమనూరులో జరిగిన జిల్లా గ్రామీణాభివృద్ధి సంఘం సమావేశంలో పాల్గొనడానికి వచ్చిన శ్రీరాములు గారికి, తక్కిన సభ్యులందరికీ ఇచ్చినట్టుగానే పదహారు రూపాయల ఎనిమిది అణాలు ఇచ్చారట! బస్సు చార్జీలకు ఒకటిన్నర రూపాయీ ఉపాహారానికి అర్ధరూపాయీ ఖర్చయినాయని శ్రీ రాములు గారు రెండు రూపాయలు మాత్రం తీసుకున్నారట! చేయని ప్రయాణాలకు డబ్బు వసూలు చేసే ఈ రోజుల్లో శ్రీరాములు గారి చర్య బతక నేర్చని పనిగా కనిపించవచ్చు.

'ఎపిక్ ఫాస్ట్ ఆఫ్ పొట్టి శ్రీ రాములు' (Epic Fast of Potti Sri Ramulu శీర్షిక కింద మహర్షి బులుసు సాంబమూర్తి గారు 1953 జూన్ 26 వ తేదీన వ్రాసిన ఖండికనూ, కస్తూరి నారాయణ మూర్తిగారు 1953 ఆగస్టు 5వ తేదీ నాడు వ్రాసిన ఖండికనూ చదివితే శ్రీరాములుగారి పట్టుదల ఎంతటితో తెలుస్తుంది.

1952 అక్టోబర్ 19 నాడు మొదలయిన శ్రీరాములుగారి నిరశనవ్రతం 1952 డిసెంబర్ 15 రాత్రి 11 గంటల 23 నిమిషాల దాకా కొనసాగింది. నాలుగు నిమ్మపండ్లను రసం పిండి రెండు ఔన్సుల తేనెతో కలిపి రోజుకు నాలుగు సార్లుగా నాలుగు మోతాదులలో తాగేవారట. కొన్నాళ్లకు తేనె నిమ్మరసమూ వెగటయితే - మారుగా కొబ్బరి నీళ్లు తాగటానికి కూడా ఆయన ఒప్పుకోలేదనీ, అపస్మార స్థితిలో ఉన్నా, తమకు ఎటువంటి ఆహారమూ బలవర్ధకాలమయిన ఔషధాలూ ఇవ్వరాదనీ ఆయన పట్టు

పట్టారట. కఠోరదీక్షతో అమరత్వం పొందిన మహానుభావుడు శ్రీరాములు గారు.

'అవర్ సెల్వ్స్' (Ourselves) అనే శీర్షిక కింద అమరజీవి స్మారక సంఘం పుట్టు పూర్వోత్తరాల వివరాలూ, సంఘం నిర్వహించిన వివిధ కార్యక్రమాల వివరాలు ఉన్నాయి.

ప్రత్యేక సంచికకే వన్నె తెచ్చినవి న్యాయమూర్తి వి.ఆర్. కృష్ణ అయ్యర్ గారు, న్యాయమూర్తి ఎస్. మోహన్ గారు, ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు, డాక్టర్ ఎ.ఎస్. రామన్ గారు చేసిన పొట్టి శ్రీరాములు స్మారకోపన్యాసాల ప్రసంగ పాఠాలు.

1985లో న్యాయమూర్తి కృష్ణ అయ్యర్ గారు 'నేషనలిజం వెర్సస్ సబ్ నేషనలిజం : ఎ క్రియేటివ్ కేస్ ఫర్ డైనమిక్ సింతెసిస్' (Nationlism Vs Sub-nationlism : A Creative Case for dynamic synthesis) శీర్షికన చేసిన ఉపన్యాసమే పొట్టి శ్రీరాములు స్మారకోపన్యాస పరంపరలో మొదటిది. అధికార వి క్రేం ద్రీ క ర ణ ప్రాముఖ్యాన్నీ ప్రాంతీయ భాషలను అభివృద్ధి చెందనీయ వలసిన అవసరాన్ని సహేతుకంగా వివరించే ఉపన్యాసం అది. 1986లో 'సోషల్ జస్టిస్ ఇన్ ఇండియా' (Social Justice in India) అనే శీర్షికన న్యాయమూర్తి ఎస్. మోహన్‌గారు చేసిన ఉపన్యాసంలో - భారత సంవిధానంలోని 38వ అధికరణం పేర్కొన్నట్లు సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని అందరికీ అందజేసే సామాజిక వ్యవస్థ స్థాపన జరగడానికి వివిధ స్థితిగతులలో ఉన్న భారతీయ పౌరులకు సా మా జి క న్యాయం అందవలసిన అ వ స ర ం గురించి చాలా కేసుల ఉదాహరణలు



పేర్కొని వివరించారు. 1988లో 'ట్రెండ్స్ ఇన్ కాంటెంపొరరీ పొయెట్రీ' (Trends in Contemporary Poetry) శీర్షికన చేసిన తమ ఉపన్యాసంలో ఆచార్య సి. నారాయణ రెడ్డిగారు తెలుగు, తమిళం, హిందీ భాషలలోని సమకాలీన కవిత్వం గురించి సోదాహరణంగా వివరించారు. డాక్టర్ ఎ.ఎస్. రామన్ గారు 'నేషనల్ ఇంటిగ్రేషన్ - ప్రాబ్లమ్స్ అండ్ ప్రాస్పెక్ట్స్' (National Integration - Problems and Prospects) పేరిట 1989లో చేసిన తమ ఉపన్యాసంలో మనదేశంలో భిన్నత్వంలో కనిపించే ఏకత్వం గురించీ, సాంస్కృతిక సమైక్యం ఆవశ్యకత గురించీ చెబుతూ, భారత ప్రజలు మంచివారే అయినా జాతీయస్థాయిలో ప్రతిరంగంలోనూ ఆదర్శవంతమైన నాయకత్వం కొరవడడమే నేటి విపరీత ధోరణులకు కారణమన్నారు.

'పొట్టి శ్రీరాములు అండ్ హిస్ మిషన్' (Potti Sri Ramulu and his mission) అనే అంశం గురించి న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు చేసిన ఉపన్యాస పాఠం కూడా ఈ సంచికలో చేర్చారు. ఈ ఉపన్యాస వ్యాసంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల గురించీ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సంబంధాల గురించీ విశేష విశ్లేషణ ఉంది.

ఈ ప్రత్యేక సంచిక కోసం ప్రత్యేకంగా వ్రాసిన వ్యాసాలు కాక ఇతర ఆకరాల నుంచి సేకరించిన వ్యాసాలు ఇందులో చేర్చారు. అటువంటి వ్యాసాలలో డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య గారి 'హిస్టరీ ఆఫ్ ఆంధ్రాస్' (History of Andhras), జె.వి. సోమయాజులుగారి 'హిస్టరీ ఆఫ్ ది ఆంధ్రా స్టేట్' (History of the Andhra State) పేర్కొనదగినవి. ఇక తెలుగు విభాగానికి వస్తే - పొట్టి శ్రీరాములు గారి గురించీ అమరజీవి స్మారక మందిరం గురించీ పదకొండు వ్యాసాలున్నాయి. ఎందరో ప్రముఖులు పొట్టి శ్రీరాములుగారి నిరుపమాన సేవను, వ్యక్తిత్వాన్ని వివరించారు. ఆచార్య పి.సి. రెడ్డి - 'సింహపురి చరిత్రలో పునీతమైన పర సప్తకం' పేరిట వ్రాసిన వ్యాసంలో శ్రీరాములు గారి రూపాన్ని ఇలా వర్ణించారు: "బాలా పొట్టి మనిషి. పొట్టిగా కత్తిరించిన క్రాఫు, మోటు ఖద్దరు అడ్డ కట్టు, భుజం మీద విస్తృ తుండు గుడ్డ. చేతిలో కాంగ్రెసు జెండా. మెడకు రెండు వైపులా అట్ట బోర్డులు. ఒకో అట్టపైన సిరాతో రాసిన నినాదాలు - 'హరిజనులను దేవాలయాల లోనికి ప్రవేశించనివ్వండి,' 'సహపంక్తి భోజనాలు చేయండి' (అని). ఆయన వేషము, ఆయన చర్యలు నాకేకాదు చూచిన ప్రతీవారికి వింతగా ఉండేది."

అమరజీవిని సంస్మరిస్తూ వ్రాసిన వ్యాసాలూ తెలుగు దిన పత్రికలలో వచ్చిన వ్యాసాలు, స్మారక మందిరం సందర్శించిన ప్రముఖుల అభిప్రాయాలూ ఈ భాగంలో ఉన్నాయి.

తెలుగు విభాగంలో శ్రీ మల్లిక్ గారి సంపాదకత్వంలో నాలుగు ప్రధాన విషయాల గురించి 58 అంశాల మీద వ్యాసాలు ప్రచురించారు. ఆ నాలుగు ప్రధాన విషయాలు - (1) చరిత్ర, సంస్కృతి (2) మద్రాసు (3) స్వాతంత్రోద్యమం (4) ఈ నలభై ఏళ్లలో వివిధ రంగాలలో తెలుగు వారి పరిస్థితి. ఈ తెలుగు విభాగంలోని వ్యాసాలలో - నాలుగైదు మాత్రమే పునర్ముద్రితాలనీ, నాలుగు ఇంటర్వ్యూల ఆధారంగా రూపొందించినవనీ, రెండు ఆంగ్లం నుంచి అనువదించినవనీ - మిగిలినవన్నీ ఈ ప్రత్యేక సంచిక కోసం ప్రత్యేకించి వ్రాయించినవనీ తెలిసినప్పుడు సంపాదకుని శ్రమ ఎంత గొప్పదో అర్థమవుతుంది.

పది నెలలబాటు ఈ సంచిక రూపకల్పనను ఒక ఉద్యమంగా పరిగణించి పరిశ్రమించిన సంపాదకుల కృషి ప్రశంసనీయం.

వ్యాసాలు వ్రాసిన అందరినీ ఇక్కడ పేరుపేరునా పేర్కొనక పోయినా ఈ సంచికలోని అనేక వ్యాసాలు కొత్త విషయాలెన్నిటినో తెలియజేస్తున్నాయని నిర్వివాదంగా చెప్పవచ్చు.

మొత్తం మీద ఈ ప్రత్యేక సంచిక - చరిత్రపట్లా సాహిత్యం పట్లా ప్రేమాభిమానాలున్న తెలుగు వారందరూ చదువుకొనదగింది.

(అమరజీవి పొట్టి శ్రీరాములు గారికి అంకితం చేసిన ప్రత్యేక సంచిక సమీక్షా కార్యక్రమం జూన్ ఆరవ తేదీ మద్రాసు పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో జరిగింది. ఆ సమీక్షా వ్యాసంలోని భాగాలు).

—డా॥ పియస్ గోపాలకృష్ణ

## ఈ మధ్య అందినవి :

పూలవాన - కవితా సంపుటి. మేడిశెట్టి తిరుమలకుమార్, ఎక్స్‌రే పబ్లిషర్స్, మద్రాసు-93.. రు. 5-00.

స్త్రీ - వచన కావ్యం రెండవ ముద్రణ... కొల్లూరి.... ఎక్స్‌రే, మద్రాసు-93 . రు 8-00.

పెండ్లి మర్యాద - బాల సాహిత్యం ... డా॥ సి. విశ్వనాథం... ఆర్ష భారతి, హైదరాబాదు - 872... రు 10-00.

చినబాబు - నాటిక.... ఎ. లక్ష్మీనారాయణ.... ఎవిఆర్ పబ్లికేషన్స్, దొప్పలపూడి - గుంటూరు జిల్లా.... రు 3-00.

ఫాదర్ డామియన్.... పి. సాంబశివరావు.... గ్రౌవాల్టెస్, విశాఖపట్నం-1.

డాక్టర్ హెన్సన్... పి. సాంబశివరావు.... గ్రౌవాల్టెస్, విశాఖపట్నం-1.... రు 10-00.



సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నా చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్య క్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో ప్రకాశరాయుడు గారొకరు.... వారి జీవిత గాధలోని సంక్షిప్త భాగాలివి.

17. శాంతి సైనికుడు తన వృత్తిలో ప్రవీణు డౌతాడు, సేద్యం చేస్తాడు వడ్రంగం, కుమ్మరం చేస్తూ గ్రామ ప్రజలకు ప్రాణ బంధువౌతాడు. ఒకరికి భయపడకుండ ఒకర్ని భయపెట్ట కుండ 'అనపేక్ష శ్శుచిర్దక్ష'-కోరికలు లేనివాడు, పరిశుద్ధుడు, కర్మకుశలు డై తాను బ్రతికి అనేకులకు బ్రతకు తెరువు చూపిస్తాడు. 18. ఖాదిగ్రామో ద్యోగాల వంటి ఆర్థిక విప్లవోద్యమ మంతా, అస్పృశ్యతా నిర్మూలన వంటి సంఘసంస్కరణ మంతా బేసిక్ విద్య (నయి తాలీమ్) వంటి జ్ఞానయజ్ఞ మంతా శాంతి సైనికుని కార్య క్షేత్రం. ఇట్లా దినదినం పదింట తొమ్మిది వంతులు దేశ నిర్మాణ కార్యంలో నిమగ్నుడై యుంటాడు. అపాయాన్ని, ఆపదను ప్రాణంతో ఎదుర్కొనే సత్యాగ్రహి దళాలే (శాంతి సేనయే) ఏ నాటికైనా ఇండియాకు నిజమైన రక్షణ నీయ గలవని గాంధీ విశ్వాసం. వెడుతూ వెడుతూ ఆయన ప్రతిపాదించిన లోక సేవక సంఘం ఎప్పటికైనా అవతరిస్తుందా ? గాంధీ ప్రజా సేవ, దక్షిణాఫ్రికాలోను, ఇండియాలోను, అంతా కలిపి 50 యేండ్లే అయినా అదొక యుగానికి సరిపడి యుంది.

ఫేయిస్ పూర్ కాంగ్రెసు మహా సభలో ఖాదీ గ్రామోద్యోగ ప్రదర్శ నాన్ని ప్రారంభిస్తూ కాబోలు మహాత్మ డొక ధర్మ సూత్రం వినిపించాడు. 'సబ్ జమీన్ గోపాల్‌కీ హై' - భూమి యావత్తూ గోపాలుని సొత్తు అని.

ఈ శతాబ్దం పేరు చెప్పి గాంధీ ఒకడు, అతనితో పాటు, అతని తరువాతను సంత్ వినోబా ఒకడు ఇండియా ప్రజకు రక్షణ మార్గాన్ని, వెదకి తీసిన ధీరులు. గాంధీ నిర్మాణ

ప్రణాళికలో నిర్దిష్టమైన భూసంస్కరణ లకు ప్రత్యేక స్థానం యీయబడ్డదో లేదో కాని ఆయన నిర్యాణం తరువాత కారణాలు కలసివచ్చి వినోబాకు ఏండ్ల తరబడి యిదే ప్రధాన కార్యమయింది. భూదానోద్యమం పేరుతో ఆయన పల్లెపల్లెకూ అన్ని రాష్ట్రాలు తిరిగాడు. స్వయంగా సేద్యం చేసుకొని బ్రతికే ఏ ఒక్కడూ భూమి హీనుడుగా ఉండరాదనే హెచ్చరికతో వినోబా - భూదానోద్యమం ప్రారంభమయింది. భూదాన సిద్ధాంతం గ్రామదాన సిద్ధాంతంగా మారింది. అంటే భూమిపై యాజమాన్యపు హక్కు ఏ ఒక్కనికీ లేదనీ, గ్రామ భూమి యావత్తూ అందరిదీ అనీ గ్రామదానంలోని ముఖ్యోద్దేశం. సరియైన విప్లవాత్మక భూసంస్కరణ ఇదే యనీ ఇటువంటి గ్రామదాన కార్యక్రమం ఒక్కటే గాంధీ తలచిన గ్రామ స్వరాజ్య (రామరాజ్య) వవ్యస్థకు నాంది కాగలదనీ వినోబా సందేశం.

భూమిని దానం చేయండని భూస్వాముల నడగటంతో ప్రారంభమైన పద్ధతిలో సమగ్రత లేదని వినోబాకు తోచింది. కేవలం భూదాన విధానంలో భూఖామందులనే తెగ ఒకటి, వారికి దయకలిగి దానం చేస్తే దానివల్ల బ్రతకవలసిన తెగ ఒకటి. - ఈ చీలిక వల్ల కలిగే అసమానత్వం చిరస్థాయిగా నిలిచిపోయే ప్రమాదం ఒకటుంది. ధర్మ రాజ్య వ్యవస్థ ఏర్పడాలంటే ఈ వర్గ భేదం ఎప్పటికైనా నశించ వలసిందే... మరొక విషయ మేమిటంటే, ఒక్కొక్కడు భూమి దున్ను కొనటమే వృత్తిగా పెట్టుకోడు. ఒక్కొకని వద్ద ఒక్కొక రకం శక్తులుంటాయి. ప్రతివాడూ తనకు గల శక్తి సామర్థ్యాలను గ్రామ పరం చేసినప్పుడే గ్రామ రాజ్యానికి పూర్ణత్వ మేర్పడుతుంది. ఎవని వద్ద ఏదిఉంటే అది స్వంతసొత్తోలేక ఇంటిసొత్తో కాక గ్రామ భాగ్యంగా ఎంచి పని చేయటంలో గ్రామ దానాని కొక సమగ్రత సౌందర్యం ఏర్పడతాయి. గ్రామంలో ఉన్న శ్రమశక్తి, బుద్ధి బలం, శారీరక బలం, - అన్నీ గ్రామ శ్రేయానికి అర్పించ బడ్డదే గ్రామ రాజ్య మనబడుతుంది. ఇట్టి సంఘ వ్యవస్థలో ఖాదీ మొదలగు గ్రామ పరిశ్రమలన్నీ సముచిత స్థానాలను ఆక్రమించి స్వయం పోషకత్వాన్ని సాధించ గలుగుతాయి. పరస్పర సహకార బుద్ధితో కూడిన స్వావలంబన (స్వయంకృషి) వలన అహింసాయుత సంఘ నిర్మాణానికి మంచి పునాది పడుతుంది.

పైబాధ్యతను మోసే సంస్థ గ్రామ సభ అనబడుతుంది. గ్రామ దానమయిన వెంటనే గ్రామ సభ ఏర్పాటు జరగాలి. ఇదివరలో కొందరు సర్వోదయ కార్యకర్తలు భూమి హీనుల కోసం భూదానాలు సేకరించేవారు. ఇకనట్లా కాదు. గ్రామసభదే (అంటే గ్రామ వాసులందరిదీ) గ్రామ భూమి యావత్తూ. గ్రామంలోని ఇంటి కొకొక్క ప్రతినిధిని తీసుకొని వారితో

'గ్రామసభ' ఏర్పడుతుంది. గ్రామ సభ పక్షాన ఐదాదుగురు సభ్యులలో కూడిన 'గ్రామసమితి' ఒకటుంటుంది. గ్రామానికి నిస్వార్థ సేవ చేయ టమే ఈ సమితి పని. కనుక దీనిని గ్రామ సేవక సమితి అనటమే సరి. గ్రామ సభ వారందరూ కలసి ఈ సేవక బృందాన్ని ఏకగ్రీవంగా ఎన్ను కొంటారు. సేవక సమితి ఎప్పుడు ఏ సలహాలిచ్చినా ఏ నిర్ణయం చేసినా అది పాక్షికమో, మెజారిటీ నిర్ణయమో కాకూడదు. ప్రతి విషయంలోను వారు ఏకాభిప్రాయానికి వచ్చితీరాలి. తుది నిర్ణయం చేసే అధికారం గ్రామసభ కున్నప్పటికిని ప్రజా సేవకు అంకిత మైన గ్రామసమితి నిర్ణయాలను గ్రామసభ తోసివేసే స్థితి రానేరాదు. గ్రామంలో నూటికి ఎనభైమంది ప్రజలు తమకున్న భూమి అంతా గ్రామసభకు స్వాధీనం చేసి మొత్తంగా గ్రామ భూమిలో యాభై శాతం దానంగా ఇచ్చినట్లయితే అది గ్రామ దానంగా పరిగణింప బడుతుంది. గ్రామ దానం జరిగి గ్రామసభ ఏర్పడిన దానికి ప్రథమ సూచనగా గ్రామ ప్రజలలో ఒక నిదర్శనం కన బడ వలెనంటాడు శ్రీ వినోబా. ప్రతీ రోజూ నియమ ప్రకారం గ్రామాభ్యు దయాన్ని గూర్చిన మంచి విషయా లను వినిపించి, వాటిని చర్చించే అలవాటు గ్రామస్తులకు చేయవలె. ప్రపంచ సమాచార పరిచయం, ధర్మ చర్చ, భగవద్విషయిక వ్యాసంగం, దిన దినం సాగుతూ వుండాలి.

గ్రామావసరాల గురించి, అవశ్యం జరగవలసిన గ్రామ సంస్కరణలను గూర్చి ఒక్కొక్క ఇంట్లో ఉన్న ఇబ్బందులను గూర్చి, వాటిని నివారించే ఉపాయాలను గురించి పర్యాలోచన ఎల్లప్పుడూ జరుగుతూ ఉండాలి. మొత్తం గ్రామం శక్తి మంతం కావాలనేది ప్రధాన విషయం. ఒక్క మాటలో గ్రామధర్మం స్థాపింప బడాలి. గ్రామ జనాభాను బట్టి గ్రామం లోని జనానికి సరిపడిన ధాన్యాలు, ఖాదీవస్త్రం ఏటేటా గ్రామంలోనే నిలువ ఉంచటం గ్రామసభ విధులలో ఒకటి. గ్రామంలో భూవసతి వున్న వారు, లేనివారు అందరు గ్రామ సభలో సభ్యులే కనుక ప్రతి కుటుంబం నుండి ఏటేటా గ్రామ సభకు కొంత దానం మాత్రం విధిగా చెల్లుతూ ఉండాలి. భూస్వాములు తమ కున్న భూమిలో ఇరవయవ వంతు, తమ ప్రేమ కానుకగా భూమి లేని కర్షకుల కొరకు దఖలు పరచవలె. మిగిలిన భూమి ఎవరికివారు తమ అధీ నంలో ఉంచుకొని తామే సాగుచేసు కొనవచ్చు.

ఇటువంటి గ్రామ దాన గ్రామా లలో ప్రభుత్వజోక్యం ఎంతవర కుంటుందనేది ఒక ప్రశ్న. క్లుప్తంగా చెప్పుకొంటే ప్రభుత్వ లెక్కలలో ఒక్కొక్క గ్రామ సభ పేరు మాత్రమే నమోదు అయిఉంటుంది గాని ఇప్పటి వలె విడివిడిగా భూమి పట్టాదార్లపేర్లు వ్రాసుకొనే పద్ధతి రద్దవుతుంది. ప్రభుత్వానికి చెల్లవలసిన పన్ను

మొత్తం గ్రామసభ ద్వారా చెల్లింపబడటం తప్ప గ్రామ శ్రేయానికి గ్రామ సభ చేసుకొనే ఏవిధమైన ఏర్పాట్లతోను ప్రభుత్వానికి ప్రసక్తి ఉండదు. గ్రామంలో న్యాయవిచారణాధికారం గ్రామ సభకే ఉంటుందా అనేది మరొక ప్రశ్న. భూసమస్య పరిష్కారమై ప్రతివానికీ చేతినిండాపని, చాలినంత అన్నం, వస్త్రం, విజ్ఞానబోధకమైన చక్కని విద్యా విధానం ఉన్నచోట గ్రామంలో తగాదాలు రానేరావు. వచ్చినా అవి అప్పటికప్పుడు సునాయాసంగా సరిదిద్దబడతాయి.

అసలు పునాదిలో నైతిక ప్రేరణ లేనిదే గ్రామ దానమే పొసగదు. ముఠారాజకీయాలలో మునిగియున్న వారు ఆధ్యాత్మిక భూమికపై నిలబడనే లేరు. మహోత్తరమైన ఈ గ్రామ దాన భావాన్ని, దాని కార్యప్రణాళికను ఈ తరుణంలో మనం గ్రామ గ్రామానికీ అందజేయవలసి యుంది. జాతి, కులభేదాలు, మతకలహాలు, భాషావాదాలు, వర్గవైషమ్యాలు, పార్టీ కక్షలు అంతరించి భారత మహోదయానికీ ఔన్నత్యానికీ దారిచూపే సులభ ప్రణాళిక ఇది. గృహ

సమస్యలు మొదలు జాతిసమస్యల వరకు శాంతిపద్దతులలో పరిష్కరించేది శాంతిసేవ. కోట్లాది ప్రజానీకానికి గౌరవప్రదమైన గృహ పరిశ్రమలను కల్పించి ధనిక, దరిద్ర భేదంలేని ప్రజాస్వామికాన్ని సార్ధక పరిచేది ఖాదీ గ్రామోద్యోగ ఉద్యమం. ఎవరి వద్ద ఎంత వస్తు సంపద, ఎంత శక్తి సంపద, బుద్ధి సంపద ఉన్నదో వాటిని గ్రామ శ్రేయానికై సమర్పించి దేశంలో ఆర్థిక సమానత్వాన్ని సర్వులకు సమాన గౌరవ మర్యాదలను సందించి పెట్టగల ఏకైక సరళ గ్రామ దానం–అని సునిశిత దృష్టితో శ్రీ వినోబా పలికే అభయం.

## 10

నా ఖాదీ గ్రామోద్యోగ ప్రణాళికా ప్రచార కార్యక్రమం అయిన తరువాత (సరీగ్గా ఎన్నాళ్ల తరువాతనో చెప్పలేను) ఆంధ్రరాష్ట్ర 'గాంధీ స్మారక నిధి'తో నాకు బంధుత్వమేర్పడింది. తిలక్ మహరాజ్ పోయినప్పుడు గాంధీ ప్రోత్సాహంతో కోటి రూపాయల 'తిలక్ స్వరాజ్య ఫండు' పోగు పడినట్లే గాంధీ నిర్యాణం తరువాత అంతకు మించిన 'గాంధీ స్మారక నిధి' ఏర్పడింది. అట్లాగే కస్తూరిబాయ్ స్మారకనిధి కూడ. మహాత్ముల పేర పోగుపడిన నిధుల తాలూకు డబ్బు ఖర్చుపడి పోయినా వారి జీవిత చరిత్రలు ఎన్నటికీ తరుగులేని నిధి నిక్షేపాలుగా నిలిచి యుంటాయి. గాంధి దంపతుల పేర వచ్చిన డబ్బులు ఏనాడో అయిపోయినాయి. ఖర్చులకు చాలక ఆ సంస్థలు కూడా నిలిచి పోయినాయి. గాంధీ భౌతిక కాయం కూడా ఒక్క తుపాకి గుండు దెబ్బతో ఎగిరిపోయింది. అయితే అతని జీవితం మృతిలేని పుణ్యకథ. ఆ కథలోని ఒక అధ్యాయం వివిధ రాష్ట్రాలలోని 'నిధి' కార్య ప్రణాళిక .... ఈరాష్ట్రంలో ఆ కార్యక్రమానివి రెండు ముఖాలు : 'గ్రామ సేవా కేంద్రాలు'; 'తత్వప్రచార కేంద్రాలు' (1) శ్రీకాకుళం జిల్లా, సర్వాపురం అగ్రహారం; (2) పశ్చిమ గోదావరి, ఆనందనికేతనం, (3) కార్వేటినగరం (4) కృష్ణా జిల్లా పెనమలూరు (5) నల్గొండ జిల్లా భూదాన పోచంపల్లి (6) వాగలమర్రి (7) మెదక్ జిల్లా పొన్నాల (8) పశ్చిమ గోదావరి, పోలవరం - గ్రామసేవా కేంద్రాలుగా పనిచేశాయి. (1) విశాఖపట్టణం (2) వరంగల్ వద్ద హనుమకొండ (3) విజయవాడ (4) హైదరాబాద్ (5) తిరుపతి (6) కాకినాడ పట్టణాలలోని కేంద్రాలు గాంధీ తత్వ ప్రచారానికి పనిచేశాయి. గ్రామ సేవా కేంద్రాలలో యిద్దరేసి కార్యకర్తలుండేవారు. తత్వ ప్రచార కేంద్రాలోల కూడ ప్రధాన కార్యకర్తలకు కొన్ని చోట్ల అసిస్టెంట్లు ఉండే వారు. సాధారణంగా గ్రామసేవా కేంద్రానికి చేరి కొంత భూవసతి కూడ ఉండేది. అందు సేద్యం, పరిశ్రమ వల్ల కొంత ఆదాయం లభించేది. అవి,

ఇవి, మొత్తం 14, 15 కేంద్రాలలోను కార్యకర్తల పని ఈక్రిందివిషయాలకు సంబంధించి యుండేది : (1) అస్పృశ్యతా నివారణ (2) వయోజన విద్య (3) ఖాదీ ప్రచారం (4) పారిశుద్ధ్యం, ఆరోగ్యం (5) గ్రామ, కుటీర పరిశ్రమలు (6) ప్రకృతి చికిత్స (7) హిందీ ప్రచారం (8) సమష్టి సేద్యం 9) 'సఫాయీ ; కంపోస్టు' తయారీ 10) మద్య నిషేధం (11) బేసిక్ విద్య (12) స్కూళ్లు, కాలేజీలు, యూనివర్సిటీ విద్యార్థిబృందాలలో కూడా గాంధీ తత్వ ప్రచారం మున్నగునవి. వయోజన విద్య అంటే కేవలం చదవడం, వ్రాయడం నేర్చుకోవడమే కాదు. కాని వాటి అవసరం కూడా లేకపోలేదు – "The only thing I can think of in terms of 'Adult Education' is intelligent and honest labour" అని గాంధీ యిచ్చిన విశాల నిర్వచనం. ఇండియా ముఖ్యంగా కర్మక్షేత్రం – అందులోని ముఖ్యంగా భూసేవ, గ్రామ జీవనానికి సంబంధించిన చేతిపనులు. చేతి పనులను పూర్వ కాలపు పాత పద్ధతులలో గాక, సులువు, ఉపయుక్తం అయిన నూతన పద్ధతుల నవలంబించి చేసుకొనడమే మహాత్ముల 'Intelligent labour' అన్నమాటలలోని భావంగా నాకర్థ మయింది.

పై కార్యక్షేత్రాలకు కేంద్రాలని పేరు పెట్టినా, అవి నిజానికి ఆశ్రమాలే. మానవ జీవితం యొక్క పవిత్రతను, ఉత్కృష్టతను కాపాడుకొంటూ, దానిని ఉన్నత స్థాయికి తీసుకొని వెళ్లేందుకు వ్యక్తి పరంగాను,

సామూహికం గాను నిత్యం ప్రయత్నిస్తూ జ్ఞాన భక్తి కర్మలరూపేణ కృషిచేసే సాధన క్షేత్రమే, ఆశ్రమం. ఈ భారతదేశంలో అనాది నుండి వినవస్తూన్న ఈ పవిత్రనామం మరల గాంధి కాలంలో వాడుకలోనికి వచ్చింది. దక్షిణాఫ్రికా టాల్‌స్టాయ్ ఫారం, సబర్మతి ఆశ్రమం, సేవా గ్రామం సమస్తజీవుల శ్రేయాన్నికోరి పనిచేసే ఆశ్రమాలే. ఆయా ఆశ్రమాల ద్వారానే మహాత్ముడు ప్రపంచానికి వెలుగు చూపాడు. గ్రామసేవయే, from A to Z, మహాత్ముని నిఘంటువు కనుక, స్మారకనిధి కార్యకర్తలు కూడా 'గ్రామసేవకులే' అనబడేవారు ....ఈ సేవకులు భారత గ్రామసేవకు సంబంధించిన సాహిత్యమంతా శ్రద్ధతో పఠించి నోట్సు వ్రాసుకోవాలి. గాంధి జీవిత చరిత్ర (అంటే ఆయన అర్ధశతాబ్దపు అవిరళ ప్రజాసేవలోని చిన్న తబ్సీళ్లన్నీ) గ్రామసేవకులకు హృద్గతమై యుండాలి. ఆయన జీవితంతో కలిసియున్న ఆశ్రమ నియమాలు (అంటే, అహింసా సత్య అస్తేయాదులు) అయి, వృత్తి యొక్క విలువలను నిర్ణయిస్తూ లాయరు వృత్తికీ, మంగలి వృత్తికీ సమాన గౌరవ ముండవలెనని జాన్ రస్కిన్ మహాశయుడన్నట్లూ, మానవత ఒక్కటే మనిషి యొక్క నిజ విలువను నిర్ణయించేది, ఇదే వేదాలన్నిటి సారం! ... గాంధీ గ్రామ సేవకుడు, తన ఆశ్రమానికి కొంత దొడ్డి యుంటే, దొడ్డి నిండాను; చోటులేకపోతే, ఇంటి సరిహద్దు గోడ ప్రక్కనైనా కొన్ని ప్రత్తి మొక్కలను పెంచి వాటి ప్రయోజనం పొందాలి. 'My spining demonstration (every yard of yarn) must remind me of the breadless millions in my country and their helpless slavery to the mills' అన్న గాంధి మాటను పైన ఒకచోట చెప్పుకునే యుంటాను.... గాంధీ గ్రామ సేవా కేంద్రాలలో 'సర్వోదయ పాత్ర'ను ప్రవేశపెట్టే ఆలోచన గూడ శ్రీ వినోబాదే, ఇష్టమున్నవారి ఇంటింటిలో ఒక బుట్టను తగిలించి గృహస్థులు అందులో దినాని కొక గుప్పెడో, చేరెడో వేసే బియ్యాన్ని వారాని కొక తడవ పోగు చేసుకొని సర్వోదయ కార్యాలకు వినియోగించడమే 'సర్వోదయపాత్ర'లోని ఉద్దేశం. అది యిప్పటికిని దాని పని అది సేస్తోంది కొన్ని చోట్ల.

గాంధీ స్మారక నిధి ఆంధ్రశాఖ నిర్వాహణ 1960వ సంవత్సర ప్రాంతంలో ప్రారంభమయిందని నా జ్ఞాపకం. 1962, 63, 64 సంవత్సరాలలో దాని State Board సభ్యుడుగా నాకు దానితో దగ్గర సంబంధమేర్పడెను.

(ఇంకా వుంది

గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ-533 123) సౌజన్యంతో ... పుస్తకం వెల : రు. 20-00.

*Travelogue*

# Another Week in West Bengal



In January (1992) we could not find time to the ancestral house of Gurudev Rabindranath Tagore. A few feet inside the main thoroughfare, it is a large palatial building with countless rooms and a vast courtyard and servants' qeartors - a huge. mansion in rectangular shape *The Cabuliwallah* must have come there and the poet must have experienced here that childhood loneliness depicted in *The Post Office*. To which room did *The Devotee* come with her offerings ?... Now it is the seat of Rabindra Bharati University where hundreds of girls and boys learn fine arts such as dance, music, painting, sculpture etc. We saw a budding painter at work and he explained to us his conception. and intricacies of expression. Unfortunately for us it was a holiday and we couldn't have deeper glimpses. There are classrooms here but still thery are not classroom in the conventional sense. We were leaving the next day ; there was no possibility of our making a second visit.

We know our visit to Calcutta is incomplete without paying respects to the two modern shrines besides the Belur Mutt. One shrine is Tagore's ancestral house where you feel that the very air has a silent melody that touches your heart. And at the other shrine you get lost in the rose-petals of history inspired by a sense of adventure and thrill. Subhas Chandra Bose even today is a dynamic hero to millions and millions of our countrymen His life is a constant source of inspiration to younger blood. They say he lived like a swan - not a crow As we were to leave for Mayapur on Monday morning, we could somehow snatch some time to see the Netaji Bhawan on the Lala Lajput Rai Road - the ancestral house of the Bose family where Netaji Museum and Research Centre are located.

Netaji Bhawan with its traditional pillars and porticos is a typical upper-class Bengali residence with wooden stairs to the first and second

floors. As we enter, we find the INA Martyr's Memorial Column on the left. Further left we find a showroom preserving the car used by Subha Babu some fifty years back and if we walk a few metres straight, we find the exit thro' which he made his great escape in 1941 from India to Kabul. After nine months his voice was heard over the Berlin Radio. And he travelled in a German submarine for ninety days, encircling Africa and crossing the Indian Ocean to reach Penang and therefrom to Tokyo to meet the then Japanese Premier, Tojo. On July 22, 1943 Subhas Chandra Bose reached Singapore and founded the Indian National Army of which he was the Commander - in - Chief. That was all a saga of adventure, heroism and a spirit of dedication to save the Mother-land from the clutches of foreign domination.

Coming back to the Bhawan, it is a store-house and museum of all what Subhas stood for. Oil Paintings of the two great Bose Brothers Sarat Chandra and Subhas Chandra - are quite imposing - you watch them with solemnity and reverence. On January 23, 1947, six or seven months earlier to our attainment of Independene, the elder brother Sarat Chandra Bose dedicated this historic building to the Nation. Netaji Research Bureau was established in this premises in 1961. Since then it has been a centre for national pilgrimage. As you pass thro' several photographs. pictures and a treasure of letters well-preserved, you get the feeling that here lived a noble son of India who with his valiant efforts fought like a brave soldier throughout his life and Fate snatched him away at a crucial moment. On August 9, 1945 Japan surrendered to America while Hitler fell in April 1945. And Subhas died in an aircrash near Formosa on August 18, 1945.

"They still say it was Rashbehari Bose but not Subhas" said Sundari.

"Just as in the case of Alluri Seetarama Raju. Ordinary people do not like to believe that their hero is dead, unless they witness the last journey. When the end is shrouded in mystery, several stories are bound to get circulated," I replied.

"Chendur Garu, I read somewhere that Subhas on his return from England passing the ICS examination. instead of taking up a job in the Government, went straight to Gandhiji to seek his guidance. As a satyagrahi, he went to jail several times. Was it all because he defied Gandhiji in standing for the presidential election second time?" asked Radha, as we were getting down the wooden steps.

"Now you will have a radio-talk till we reach our place," commented Malati, as we got into the car. Driver Khan had gone to a nearby tea-stall.

"It is not that simple as it appears on surface. In 1915 Gopala Krishna Gokhale, founder of the Servants of India Society, passed away and in 1920 Bal Gangadhar Tilak who was advocating Home Rule passed away. Mahatma Gandhi emerged as a single powerful revolutionary leader on the political horizon of India. His experiment of hartal in protest against the Jallianwalla Bagh Massacre was a stupendous success. And you must remember that Mahatma Gandhi was an undisputed leader from 1920 till he was assassinated by Godse in January 1948. Subhas saw Gandhi in 1921 at Bombay and said he would like to serve the nation. Gandhiji asked him to learn his lessons from Chitta Ranjan Das of Calcutta. When CR Das was chosen as Mayor of Calcutta, Subhas Chandra Bose was the Chief Executive Officer of the Calcutta Corporation."

"Chittaranjan Das also belonged to the Congress Party?" questioned Sundari.

"They were all nationalists but they didn't see eye to eye with Gandhi. They respected Gandhiji - they accepted him as their sole leader but they differed on certain issues..."

"For instance?" Malati wanted me to quote examples.

"Gandhiji's weapons were non-violence and non-cooperation - they proved extremely efficacious against the might of a colonial power. The entire nation was behind him in the struggle for Independence. But in 1922 when he suddenly suspended the Civil Disobedience Campaign, on eruption of violence somewhere, several national leaders were dismayed and amongst them were CR Das and Motilal Nehru - they

didn't leave the Congress - they were in the Congress Fold but formed Swaraj Party. The greatness of Gandhiji was to allow them have their say and go their way - that was how he built up the Congress as a mighty national force. CR Das and Motilal Nehru of the Swaraj Party advocated entry into legislature to fight from within. *Swarajya*," a newspaper of Prakasam Pantulu, was to 'propagate that viewpoint. Incidentally we should know that quite a number of well-known journalists flowered thro' *Swarajya*". Driver Khan had come back and the car started moving.

"Prakasam Garu also opposed Gandhiji but he adhered to Gandhism till the end," observed Radha.

"Prakasam Garu was more Gandhian than Gandhi himself - that is a different story. In any political movement we have three phases - thesis, anti-thesis and synthesis. The progressive elements become a Left Wing while the Old Guard is called the Right Wing. There is always discussion, difference of opinion, compromise in the interests of the unity - these are inevitable. In the process of synthesis Gandhi stood as a colossus. He allowed the Swarajyists to enter the legislatures but they were still Congressmen. In 1927 when Simon Commission visited India the atmosphere was ripe for launching another struggle. In 1928 at the Calcutta Congress a resolution for Dominion Status was passed with 1300 votes for and 900 against, with Subhas in the opposite camp, demanding complete independence. In 1920 Nagpur Session itself a resolution on Swaraj was passed. We should not get confused with the political terminology - all they wanted was freedom from foreign domination. A year later, at the Lahore Session, Poorna Swaraj Resolution was passed. Gandhiji was a shrewd tactician and none to match him in those days. With CR Das passing away in 1925 and Motilal Nehru in 1931, Gandhi was the supreme leader of our national movement, with his wonderful spirit of accommodation and open-mindedness."

"You are telling us interesting history. We all know Gandhiji was a towering personality, a great man who would be born once in a thousand years as Einstein has said. We want to know where

and how Gandhi and Subhas differed. Could it be the defiance of Subhas when Gandhi advised him not to contest for Tripura election ?" questioned Radha.

"Not so. It was a question of Ends and Means. You know Gandhi's Philosophy that Means should be unsullied and pure to achieve good Ends. He was emphatic on that. Just like Swarajyist of the 20's, in 1934 there emerged in the Congress a separate Left Wing element called Congress Socialist Party. Subhas was elected as President for the Haripura Congress of 1938. You know how the Congress Working Committee is formed - ten elected members and ten nominated ones at the discretion of the President. Subhas filled the Working Committee with his socialist friends. Gandhiji didn't mind but when a situation arose wherein the loyalists were being pushed to the wall, Gandhi had to interfere. He wanted Subhas to step down. Pattabi, with the blessings of Gandhiji, contested for Tripura election but lost and Gandhi said in his rhetoric - that Pattabhi's defeat was his defeat. In fact it was the defeat of Subhas, as he could not form the Working Committee without the cooperation of Old Guard and he had to resign and walk out. When the Second World War broke out in September 1939, Gandhi said he would cooperate with Britain in the prosecution of the war and would not create any embarassment. "When the enemy is in trouble you should take full advantage of his predicament for out national gain that was the stand taken by Subhas," I explained.

"Ethically Gandhi was right but from practical point of view ?" mumbled Sundari.

"Gandhiji was a socio political philospher who translated his philosophy into reality by way of Constructive Programme and Political Movement. He was not opposed to Machine but the Machine should not transform Man into a machine," - I concluded as we entered the premises of the Nizam Palace Quarters.

**—NR CHENDUR**



# డైరీ

## జూన్ 26, 1992

వెనకటి సంచికలో మిస్ పెన్నీ మార్షల్ నిర్మించిన 'బిగ్' జోయల్ - ఎదాన్ సోదరుల 'రయిజింగ్ అరిజోనా' - అమెరికన్ సెంటర్లో చూపిన చిత్రాల గురించి చెప్పాను. రెండూ హాయిగా నవ్వించే కామెడీలే! ఫెస్టివల్‌లో మొత్తం ఆరు చిత్రాలు - అందులో నాలుగు మాత్రమే చూడగల వ్యవధి చిక్కింది. స్పయిక్ లీ అనే బ్లాక్ ఫిలిమ్ మేకర్ తీసిన 'అది తనకు కావాలి', 1986 కానిస్ ఫెస్టివల్‌లో, యువత నిర్మించిన ఉత్తమ చిత్రంగా బహుమతి పొందింది. ఆ చిత్రాన్ని తన 18 వ ఏట చూసి ప్రభావితుడైన జాన్ సింగిల్‌టన్ (అతనూ బ్లాకే) 23 ఏళ్ల వయసులో తీసిన 'బాయస్' చిత్రం పెద్ద హిట్ అవడమే గాకుండా అనేక ప్రశంసలు పొందింది. వీరి కోవలోని వాడే 26 ఏళ్ల స్టీవెన్ సొడర్ బెర్. 1989 కానిస్ ఫెస్టివల్‌లో బహుమతి పొందిన ఉత్తమ చిత్రం యితను తీసిన 'సెక్సు, అబద్ధాలు, వీడియో టేపు.' ఈ పిక్చర్ స్క్రిప్టు ఎనిమిది రోజులలో రాసుకున్నాడు; దర్శకత్వం, కెమెరా, ఎడిటింగ్ అన్నీ తనే! తన జీవితాన్ని నాలుగు ముక్కలుగా విభజించి, యిందులోని నాలుగు పాత్రలూ నిర్మించానంటాడు స్టీవెన్. యువ నిర్మాతలలో స్వానుభవ జీవన ప్రతిబింబం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది... జాన్ ప్రయోజకుడూ సంపన్నుడూ అయిన లాయర్ - ఇల్లూ కార్పెట్లూ పరిశుభ్రంగా వుంచే ఆదర్శ గృహిణి యాన్. కాలేజి రోజుల నాటి మిత్రుడు గ్రాహమ్, తొమ్మిదేళ్ల తర్వాత జాన్‌ని చూడటానికి, ఆ ఊరు వస్తాడు. ఈ గ్రాహమ్‌కి వీడియో పిచ్చి - వ్యక్తుల అంతరంగిక జీవితాలు వీడియో రెక్కించే పిచ్చి. ఒక విధంగా అది మానసిక రుగ్మత. చిత్రకారిణి అయిన మరదలు సింతియాతో, జాన్ సంబంధం పెట్టుకుంటాడు. యాన్ అంతగా పట్టించుకోదు. కాని, మానసిక రోగి అయిన గ్రాహమ్, యాన్ మనసు విరిచి, వారి కాపురం కూలేదాకా నిద్రపోడు. వీడియో టేపు ద్వారా తన భార్య ప్రవర్తన తెలుసుకున్న జాన్‌కి, స్త్రీ

స్వభావం మీద నమ్మకం పోతుంది. ఇద్దరూ విడిపోతారు. గ్రాహమ్‌ని వుద్ధరించగలిగిందా యాన్ ? - అనేది ప్రశ్నార్థకం, తొమ్మిదేళ్ల వైవాహిక జీవితం విఫలమవడం మాత్రం వాస్తవం.

. . . . . 27

స్పయిక్ లీ తను నిర్మించి, దర్శకత్వం వహించి, నటించిన చిత్రం "చేసేది కరెక్ట్‌గా చెయ్" (Do the Right Thing) న్యూయార్క్‌లో ఒక మూల నల్లవారూ, స్పానిష్‌వారూ అధికంగా ఉండే చోట, 'ఇటాలియన్ అమెరికన్'ది ఒక చిన్న హొటలు (పిజ్జా పార్లర్). తండ్రీ కొడుకులు వొళ్లు వంచి పని చేస్తూ కష్టపడి నడుపుతున్న, ఆ ఆహార విక్రయ శాలలో ఒక నీగ్రో యువకుడు డెలివరీ బాయ్. హొటల్, అందరికీ కావాలి, అందరికీ దానితో పని వుంది. కాని, కలతలూ, కయ్యాలూ, మాట పట్టింపులూ, జగడాలూ ఆవిర్భవించేది అక్కడినుంచే! డైరక్టరు స్పయిక్ లీ, తను నీగ్రో అయినప్పటికీ, నల్లవారి తొందరబాటుని, అనాలోచిత కార్యాలని, దుడుసుతనాన్ని చిత్రీకరించడంలో ఏ మాత్రం వెనకాడలేదు. దొమ్మీ లేవదీయడం వారికి సరదా - కారణం : నిత్య దారిద్ర్యం, పేవ్‌మెంటు మీద గొడుగు నీడని కూచుని, ప్రగల్భాలు పలకడం తప్పితే, చేసేందుకు పనిలేదు. అటువంటి ఒక దొమ్మీలో, పోలీసుల చేతికి చిక్కకుండా గింజుకుంటున్న, ఒక నీగ్రో మరణిస్తాడు. అందుకు ప్రతీకార చర్యగా 'ఇటాలియన్ - అమెరికన్' నడుపుతున్న 'పార్లర్'ని తగలబెడతారు. దౌర్జన్యం వల్ల ఏ సమస్యా పరిష్కారం కాదని వ్యక్తికి తెలుసు ; కాని, మూక మనస్తత్వం అంకుదు భిన్నం.

జులై 01, 1992

కాంభోజదేశం, కాంబోడియా, కంపూచియా - ఈ మూడూ ఒకే దేశానికి కాలగతితో మారిన పేర్లు. పోర్చుగీస్, డచ్, ఫ్రెంచి, ఇంగ్లీషు జాతులవారు ఆసియా ఖండంలోని పలు ప్రాంతాలని, తమ విహార భూములుగా వాడుకున్నారు. అమెరికాది కూడా తక్కువ పాత్రేమీ కాదు - కాని, ఆ పద్ధతీ, ఆ వ్యవహారం వేరు. పోర్చుగీసు, డచ్చీ వెనకబడగా, 'నీవా నేనా ?' అని భారీ ఎత్తున వివరంటూ పోరాటం సలిపారు ఫ్రెంచివారూ ఆంగ్లేయులూ ను. ఇండియాలో ఓడిపోయిన ఫ్రెంచివారు, ఇండోచైనాలో తమ ఆధిపత్యం నిలబెట్టుకున్నారు. వియత్నామ్, తాయిలాండ్, కాంబోడియా యిత్యాదులన్నీ ఫ్రెంచివారి వలసాధిపత్యంలోనివే! రెండవ ప్రపంచ యుద్ధం, వలన విధానానికి చరమగీతం పాడటంతో, ఎక్కడి కక్కడ తమ స్వంత లాభం చూసుకు, ఈ వలస దేశాల ప్రజల మధ్య ముళ్ళు పెట్టి, గాలికి వొదిలేశారు వెనుకటి అధినేతలు.... 73

లక్షల జనాభా గల కాంబోడియా ఒక సర్వ స్వతంత్ర దేశం - 73 లక్షలంటే మన బొంబయి కంటె, కలకత్తా కంటె తక్కువ జనభా అధికంగా బౌద్ధులు, మైనారిటీలుగా క్రైస్తవులు, ముస్లిమ్‌లు. ప్రధాన భాష ఫ్రెంచి; ప్రజల భాష ఖెమర్.... రాజు పేరు : సిహనాక్ (విక్రమ సింహుడి మాదిరి) .... 1970 లో ఈ సిహనాక్‌ని పదవీచ్యుతుని గావించారు తిరుగుబాటు దారులు, 'లానాల్'ని వారసుని చేసి, ఆయన దేశం వొదిలి భద్రంగా బెజింగ్ వెళ్ళిపోతాడు. ఉత్తర వియత్నామ్, వియత్ కాంగ్, దక్షిణ వియత్నామ్ అని, సైగాన్, హనాయ్‌ల విషయంలో విన్నట్లే, మనకు ప్రచ్ఛన రష్యన్ కమ్యూనిజమ్, ప్రచ్ఛన్న చైనీయ కమ్యూనిజమ్, ఈ రెండిటికీ ప్రతిగా అమెరికా ప్రమేయమూ కనిపిస్తాయి. ఎవరి స్వప్రయోజనం కోసం వారు పోరుసాగించడమే తప్ప, సామాన్య ప్రజల గోడు వినే నాథుడు, లేడు. ఖెమర్ రూజ్ (విప్లవ సేవ) నాయకుడు 'పాల్ పాట్' 1975 -'79 మధ్య కాలంలో, పట్నాలలోని వారందరినీ పల్లెలకు తరిమి, మొత్తం దేశాన్ని నానా బీభత్సం చేశాడు. దేశ జనాభాలో అయిదోవంతు నశించింది. ఆస్పత్రులు, స్కూళ్లూ కట్టేశారు.... వియత్నామ్ ఈ దేశంపై దండెత్తి 'పాల్ పాట్' పాలన అంతమొందించింది.... ఆ నాలుగేళ్ళు కాంబోడియా చరిత్రలో ఒక కాళరాత్రి.... ఇవ్వాళ అమెరికన్ సెంటర్లో చూపిన 'ది కిల్లింగ్ ఫీల్డ్స్ (The Killing Fields)' అనే 141 ని॥ల చిత్రం, 1975లో రాజధానీ నగరమైన 'నామ్‌పెన్' ఖెమర్ రూజ్ హస్తగత మవడంతో ప్రారంభమవుతుంది. 'ట్రిగ్గర్ హాపీ' సోల్జర్లే తప్ప, ఒక శిక్షణ, ఒక క్రమత, ఒక ధ్యేయమూ లేవు. 'న్యూయార్క్ టైమ్సు' విలేఖరి సిడ్నీ షాన్ బెర్గ్‌ని మరో ముగ్గురు విలేఖరులని 'డిత్ ప్రాణ్' అనే దుబాసీ (ఖెమర్ భాషలోవి వీరికి యింగ్లీషులో చెప్పడం) మృత్యువాకిట నుంచి తప్పిస్తాడు. సైనిక ఆక్రమణ అంటే యింత ఆటవికంగాను, కిరాతకంగాను ఉంటుందని ఊహించలేకపోతారు ఈ విలేఖరులు. సిడ్నీ అతని ఫ్రెండ్సూ బయట పడగలుగుతారు; ప్రాణ్ కుటుంబాన్ని వెలుపలికి తేగలుగుతారు ; కాని ప్రాణ్ మాత్రం నాలుగు సంవత్సరాల బానిస బ్రతుకులో నరకయాతన అనుభవించి, కొన ఊపిరితో థాయ్ సరిహద్దు చేరుకుంటాడు. ఈ యిరువురు మిత్రుల కలయిక చూస్తున్నప్పుడు, అది సినిమా అని తెలిసి కూడా, ద్రవీ భూత మనస్కుల మవుతాము. నిజానికది సాధారణ అర్థంలోని సినిమా కాదు - యదార్థ సంఘటన. 1980లో సిడ్నీ షాన్‌బర్గ్ తన అనుభవమంతా 'న్యూయార్క్ టైమ్సు'లో రాశాడు. అది చదివి స్పందించిన ఫిలిమ్ నిర్మాత డేవిడ్ పుట్ నామ్, 'విజువల్ మీడియా' ద్వారా దీనిని లోకానికి చెప్పాలనే ఆకాంక్షతో ఈ చిత్రాన్ని రూపొందించాడు.

. . . . . 07

"మద్రాసు తెలుగు అకడమీకి రాష్ట్రస్థాయిలోను, జాతీయ స్థాయిలోను పత్రికల వారిస్తున్న ప్రోత్సాహానికి, నాతరఫున, అకాడమీ తరఫున కృతజ్ఞతలు తెలుపుతున్నాను. సాంస్కృతిక ప్రధాన, అంటే సంగీత నాట్యాదుల ద్వారా, జాతీయ సమైక్యతకు యితోధిక కృషి జరుపుతున్నాము. మద్రాసు మ్యూజిక్ అకాడమీలో జులై 16 నుంచి 19 దాకా నాలుగు రోజుల పాటు ప్రతి సాయంత్రం జరిగే ఉత్సవాల వివరాలు, వ్యవసాపకులు శాస్త్రిగారు నెబుతారు" - అన్నారు అకాడమీ ఛెయిర్‌మాన్ పి ఓబుల రెడ్డి, ఉడ్‌లాండ్స్‌లోని ప్రాత్రికేయ సమావేశంలో, ప్రవేశ రుసుమూ, టికెట్లూ లేని (అడ్మిషన్ కార్డు మాత్రం వుండాలి - ముందే వ్రాసి తెప్పించుకోవాలి) ఈ ఉత్సవ వివరాలు సంస్థ రథసారధి టివికె శాస్త్రి ప్రెస్ వారికి చెప్పారు. వీటిని 'స్పిరిట్ ఆఫ్ యూనిటీ కాన్సర్టస్' అంటారు. పన్నెండేళ్లుగా ఒక మహోన్నత లక్ష్యంతో ఈ సాంస్కృతికోత్సవాలు జరుపుతోంది మద్రాసు తెలుగు అకాడమీ. వివిధ రంగాలలోని ప్రముఖు లనేకులు ఈ సంస్థ అభివృద్ధికి సహాయ సహకారాలు అందజేస్తున్నారు. సమైక్యతా లక్ష్యంతో నిర్వహిస్తున్న ఈ ఉత్సవాలు ఎంతో అర్థవంతమూ, ఆనంద ప్రదమూను... తమిళనాడు గవర్నర్ భీష్మనారాయణ్

# ముఖ చిత్రం

సత్సంప్రదాయ హిందూ బ్రాహ్మణ కుటుంబంలోను, క్రైస్తవ ఫాదరీల విద్యాలయాల్లోను పెరిగిన వ్యక్తికి, అదృశ్యమూర్తి సర్వాంతర్యామిగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు. దుర్భర దారిద్ర్యంలో భగవద్దర్శనమనేది అర్థం లేనిమాట. ఫిలాసఫీ అంటే ఆర్థిక వ్యవస్థ విస్మరించడం కాదు. కళాతపస్వి అంతర్ జ్ఞాన శక్తిని, వైజ్ఞానికుని పరిశోధనా శక్తిని, సాధుపుంగవుని అంతర్వీక్షణ శక్తిని రాధాకృష్ణన్ ఫిలాసఫీ గుర్తిస్తుంది. ఎంతటి గొప్ప తత్త్వవేత్తో, అంత చక్కటి సంభాషణా చతురుడాయన. 1966 లో యునెస్కో వారు పారిస్‌లో, విశ్వకవి రవీంద్రుని శతజయంతి జరుపుతున్నప్పుడు, రాధాకృష్ణన్ చేసిన ఆంగ్ల ఉపన్యాసం, స్పానిష్, ఫ్రెంచి, పెర్షియన్ సంస్కృత భాషల సౌందర్య ధారతో శ్రోతలను విస్మయపరిచిందట — పరిశుద్ధమైన ఆంగ్ల భాషా పటిమకు వేదోచ్చారణ జనితమగు లయగతులు తోడవుతాయి. ఇటువంటి 'ఫిలాసఫర్ - ప్రెసిడెంట్' చరిత్రలో మరొకరు లేరని యావత్ప్రపంచమూ మెచ్చుకుంది ... సెప్టెంబరు 5 ఆయన పవిత్ర స్మృతికి నివాళి.

సింగ్ జులై 16 గురువారం నాడు ప్రారంభోత్సవం చేస్తారు - లాల్ గుడి జయరామన్ వయొలిన్, తర్వాత, శేష గోపాలన్ గాత్ర సంగీతం ; అజయ్ పహుకర్ హిందూ సానీ మ్యూజిక్.... 17వ తేదీ శుక్ర వారం దేబ్‌జాని (దేవయాని) మజుం దార్ నృత్యం : ప్రపంచం సీతారాం కర్ణాటకలోను, రఘునాథ్ సేత్ హిందూస్థానీబాణీ లోను ఫ్లూట్ జుగల్‌బందీ ; శేషాచారి, రాఘవా చారీల (హైదరాబాదు సోదరులు) కర్ణాటక క్లాసికల్. ముఖ్యఅతిథి : కేంద్ర సమాచార మంత్రి అజిత్ కుమార్ పాంజా.... 18వ తేదీ శని వారం ఛీఫ్‌గెస్ట్ : ఎలక్షన్ కమీషన్ టియన్ శేషన్.... యువకళా కారిణి డి వర్ధని ; హైదరాబాదు సిస్టర్స్ లలిత, హరిప్రియ ; వైద్యనాథన్ వాద్య సమ్మేళన కార్యక్రమం... 19వ తేదీ ఆదివారం, యన్ గణే శన్ కర్ణాటక బాణీ సంతూర్ వాద నంలో ; బొంబే జయశ్రీ కర్ణాటక, కంకణా బెనర్జీ హిందూస్థానీ ; సుధా రాణి రఘుపతి 'కృష్ణమ్ వందే జగద్గురు' నృత్యనాటిక. ముఖ్య అతిథి : మాజీ కేంద్రమంత్రి పి చిదంబరం.... జయాశేఖర్, జయంతీ సుబ్రహ్మణం, కళ, ప్రభావతి - ఈ నాలుగు రోజుల ఉత్సవ కార్యక్రమ వ్యాఖ్యాతలు, రోజూ సాయింత్రం నాలుగు గంటలకి ప్రారంభమవు తాయి ; ముగిసే సరికి తొమ్మిదవు తుంది.... 17వ తేదీన హైదరాబాదు వెళ్లాలి గనక, 'ఇనాగరేషన్'కి మాత్రమే వుండగలుగుతాను.

..... 14

"వెంపటి చిన సత్యంగారు నా గురువు - కూచిపూడి నాకు నేర్పారు. ఇతర నాట్యరీతులు వేర్వేరు గురువుల వద్ద అభ్యసించాను గాని, చిన సత్యం గారికి సాటి మరొకరు లేరు. శిష్యు లకి నాట్యవిద్య పట్లగల అభిలాష ఆయనకు ప్రధానం గాని, ఫీజు గురించిన ధ్యాస ఏనాడూ లేదు.... విద్యా శిక్షణలో సంపన్నులూ పేదలూ అందరూ ఒకటే ఆయనకు. నేర్చుకొనే వారిలోని కళాతృష్ణే ఆయ నకు ముఖ్యం. అటువంటి ఆదర్శ మూర్తి, కూచిపూడికి అంకితమై దానిని ప్రపంచపటంపై నిలబెట్టిన అంకిత భావ మనస్కుడూ, ఉన్నతాత్ముడూ, ఈ విశాల భారతావనిలో, నాకు తెలిసి నంతలో, మరొకరు లేరు. నా రాజ కీయ గురువు, నాకు మార్గదర్శి అయిన మహనీయుడు యమ్ జి రామ చంద్రన్, కూచిపూడి ఆర్ట్ అకాడమీకి, 1986లో అయిదు గ్రవుండ్ల స్థలం 'కన్‌సెషనల్ రేటుకి' తమిళనాడు ప్రభుత్వం చేత యిప్పించారు ; అను కూలమైన స్వంత భవనం ఏర్పడింది. నాలుగు మూడు నెలల క్రితం గురువు గారు నా వద్దకు, వచ్చి, 'చేరువగా అంటి పెట్టుకు నున్న స్థలం మరి కొంచెం యిప్పిస్తే, స్టూడెంట్స్‌కి హాస్టల్ వీలుగా ఉంటుంది' - అన్నారు. గురువుగారి అభ్యర్ధన నెరవేర్చ గల

స్థానంలో నన్ను కూచోబెట్టిన, తమిళ నాడు ప్రజకు నేను సర్వదా కృతజ్ఞురాలను. మూడువేల చ ద ర పు అడుగు నేల అకాడమీకి, వెనకటి మాదిరి కన్ సెషనల్ రేటులో యిచ్చేందుకు మే 29వ తేదీన ప్రభుత్వ ఉత్తరువు జారీ అయింది. ఈ విధంగా కూచిపూడి ఆర్ట్ అకాడమీ అభివృద్ధికి సాయపడ గలగటం నా అదృష్టం.... సత్యం గారి సతీమణిని చూడటం యిదే మొదటిసారి. అద్వితీయమైన సహనంతో ఆమె, వెనక నిలబడి వుండక పోతే, ఆయన తన కృషితో విజయం సాధించ గలిగేవారా అనిపిస్తుంది.... ఈ అకాడమీని ఒక రిసెర్చి సెంటర్‌గా చేయడం గురించి ప్రస్తావించారు. అలాటి వాటి విషయం యి ప్ప డు నేనేమీ చెప్ప లేను గాని, అకాడమీ చేసే కూచిపూడి నాట్య విద్యా వ్యాప్తికి యితోధిక సహకారం ఎప్పుడూ ఉంటుంది," - అన్నారు తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత, కూచిపూడి ఆర్ట్ అకాడమీలో, 'యమ్ జి ఆర్' చిత్ర పటాన్ని ఆవిష్కరిస్తూ; చిత్ర కారుడు డి భద్రాజీని సన్మానించారు. పప్పు వేణుగోపాలరావు ఈ ఉదయం కార్యక్రమాన్ని ఎంతో రసవత్తరంగా నిర్వహించారు; వందన సమర్పణ: పివి రమణయ్య రాజా.... సాయింత్రం మ్యూజిక్ అకాడమీలో, ముప్పయి మంది కళాకారులతో 'శివధనుర్భంగం' నృత్య నాటిక.... (ఈ 3000 చ॥ అడుగుల స్థలం తక్కువ ధరకి యిప్పించడమే గాక, ఆ మొత్తాన్ని తనే స్వంతంగా యిచ్చారని తర్వాత తెలిసింది)....అమృత సోనలని కవులు

చెబుతారే, అంత మధురంగా మాట్లా డారు జయలలిత.

సాయింత్రం మ్యూజిక్ అకాడమీ లోని ఫంక్షన్‌కి ముఖ్య అతిథి తమిళ నాడు ముఖ్య మంత్రి జయలలిత. కెసిపి వియల్ దత్తు ప్రసంగం తర్వాత సన్మాన కార్యక్రమం. గురువు, రచయిత భుజంగరాయ శర్మ, మ్యూజిక్ కంపోజర్ సంగీతరావు మున్నగువారిని ముఖ్య అతిథి గౌర వించారు; మిసెస్ దత్తు జయలలితను పుష్పమాలాలం కృతులు గావించగా, దత్తు, రమణయ్యరాజా, వెంపటి చినసత్యం ముఖ్య అతిథిని సన్మా నించారు. ఉదయం జరిగిన ఫంక్షన్ బహు కొద్ది మందికి; ఇది మ్యూజిక్ అకాడమీ పట్టేటంత మందికి – ఎక్కడికక్కడ భద్రతా సిబ్బందితో... "కూచిపూడి ఆర్ట్ అకాడమీ ఒక వ్యక్తి బుజాల మీదుగా విస్తరించిన అనుపమ సంస్థ.... 'రిథిమ్' (లయ బద్ధత, నాట్య కళ ద్వారా వ్యక్తమవు తుంది. అది సృష్టి సౌందర్యంలో అంతర్గతమై వున్నదని భారతీయ సంస్కృతి భావిస్తుంది. మన పవిత్ర గ్రంథాలు నాట్యారాధనని భగవత్సే వగా పేర్కొంటున్నాయి. రెండు వేల ఏళ్ళ క్రితం భరత ముని నాట్య శాస్త్రాన్ని రచించారు. శిలప్పదికారమ్ లో దాక్షిణాత్య నృతరీతుల గురించి, వాద్య సంగీతం, వేర్వేరు వాద్య విశేషాల గురించి ఎంతో విపులంగా ఉంది. 10 వ శతాబ్దంలో భరత నాట్యం దక్షిణాన బాగా వ్యాప్తిలో ఉండేది. భరత నాట్యం తమిళ ప్రాంతానిదైతే, కూచిపూడి అయిదు వందల ఏళ్ళక్రితం తెలుగు గడ్డపై జనించింది. ప్రారంభంలో దీనిని 'భాగవత మేళ నాటక' మనేవారు - విజయనగర సంస్థా నాధీశులు ఈ కళా ప్రక్రియను ప్రోత్సహించారు. 'డాన్స్ - డ్రామా' కూచిపూడి సంప్ర దాయం. ఆంధ్రా నుంచి తమిళ ప్రాంతానికి (వరగూర్ గ్రామం) వలస వెళ్ళిన నారాయణ తీర్థుల వారి శిష్యుడు సిద్ధేంద్ర యోగి. నారాయణ తీర్థులు రచించిన 'కృష్ణలీలా తరం గిణి' కూచిపూడి నాట్యానికి కొత్త ఊపిరి నిచ్చింది. అలాగే 'భామా కలాపం' కూచిపూడిలోని ప్రత్యేకత. గతి లయలు, పద అభినయం, కర చరణ విన్యాసం - ఒకప్పుడు యిది పురుషులకే పరిమితం; కాని, యిప్పుడు అధికంగా స్త్రీలే దీనిని ఆదరిస్తున్నారు.... వేదాంతం లక్ష్మీ నారాయణ శాస్త్రి, వేదాంతం సత్య నారాయణ శర్మ, చింతా కృష్ణమూర్తి వేదాంతం రాఘవయ్య, వెంపటి చిన సత్యం వంటివారు - కూచిపూడి నాట్యకళను వ్యాప్తిలోకి తెచ్చారు. సత్యంగారు ఈ కూచిపూడికి అంత ర్జాతీయ ఖ్యాతి చొనగూర్చారు. ఈ శుభ సందర్భంగా కూచిపూడి ఆర్ట్ అకాడమీకి, అక్కడ విద్య నేర్చు కుంటున్న కళాకారులకు నా శుభా కాంక్షలు" - అన్నారు మ్యూజిక్ అకాడమీలో తమిళనాడు ముఖ్య మంత్రి జయలలిత.... కార్యక్రమ

నిర్వాహకులు; పప్పు వేణుగోపాల రావు; 'నృత్యనాటిక' (శివధను ర్భంగం) పూర్తయేసరికి తొమ్మిది న్నర అయింది.

. . . . 21

గుత్తా మధుసూదనరావు, విజయ బాపినీడు దరకత్వంలో నిర్మిస్తున్న, 'వాలుజడ - తోలుబెల్టు' చిత్రంలోని అయిదు పాటలూ భువన చంద్ర రాసినవి. 'గోలీ సోడా తాగిస్తారా, పోలీ సోడా యీయేల - తిరపతి లడ్డు తినిపిస్తా, నా పరపతి చూస్కో యీ వేలి' అని మాల్గాడి శుభ కవ్విం చగా, 'అబ్బ ఏం గాలి, ఏం కావాలి - వెచ్చగా నీలో దాగిపోవాలి' - అంటారు యస్పి బాలు, చిత్ర .... రాజేంద్ర ప్రసాద్, కనక, నూతన ప్రసాద్, బ్రహ్మానందం, పియల్ నారాయణ, నిర్మల, రాధాకుమారి మున్నగువారున్న ఈ చిత్రంలోని అయిదు పాటలూ 'దేవి - శ్రీదేవి'లో. పాత్రికేయులకు చూపింబారు .... పి ఆర్ ఒ: జగన్.

. . . . . 25

కేంద్ర సాహిత్య అకాడమీ యివ్వాళ, రేపూ 'వైయాపురి పిళ్లై' శత జయంతి జరుపుతున్న సంద ర్భంగా, అకాడమీ కార్యదర్శి ఇంద్ర నాధ్ ఛౌధురి ఆహూతులకు స్వాగతం చెబుతూ, ప్రొఫెసరు పిళ్లై 1926 - 1936 మధ్యకాలంలో ఎనిమిది సంపుటాలుగా వెలువరించిన 'తమిళ లెక్సికన్' (నిఘంటువు) ఆయన వైజ్ఞా నిక దృష్టికి, పాండితీ ప్రతిభకు, ప్రాచీన సాహిత్య పరిశోధనకు దేదీ ప్యమానమైన దృష్టాంతంగా నిలిచి పోతుందన్నారు. బహుభాషా వేత్తలు జంకు గొంకులులేని సత్యాన్వేషకులు అవడం వల్లనే వైయాపురి పిళ్లై 'సంగమ్ పిరిడ్'కి సరియైన కాల నిర్ణయం చేయగలిగారు; ఈ లెక్సి కన్‌గాక అనేక తాళ పత్ర గ్రంథాలను



## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలు వడేవన్నీ మాఅంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగు తాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004



పరిష్కరించి అచ్చులోకి తెచ్చారు; నవలా సాహిత్యాల పట్ల ఆయనకు అభిమానమూ, సదభిప్రాయమూ వుండటం వల్లనే, అనేక పరిశోధనలలో నిమగ్నులై కూడా 'రాజి' అనే నవల వ్రాయగలిగారు' - అని స్వాగత వచనంలో చెప్పారు ఇంద్రనాథ్ చౌధురి. ప్రారంభోపన్యాసం గావించిన వియల్ సుబ్రమణియన్, అధ్యక్షత వహించిన చిదంబర సుబ్రమణియన్, వందన సమర్పణ చేసిన పెరియ కరుప్పన్, వైయాపురి పిళ్లై తమిళ సాహిత్యాన్ని ఎలా సుసంపన్నం చేసినదీ చెప్పారు. పదకొండు గంటలకు ప్రారంభమై, పన్నెండయే సరికి, ఈ పరిచయ సమావేశం ముగిసింది.

సెమినార్ మొదటి సమావేశం, ఇందిరా పార్థసారథి అధ్యక్షతను పన్నెండు గంటలకు ప్రారంభమయింది. అంశం: వైయాపురి పిళ్లై జీవితము - ఆయన గ్రంథాలు - స్థూల పరిశీలన.... "ఆర్య - ద్రావిడ అడ్డుగోడను పడగొట్టి తమిళ సమాజాన్ని ఒక విపత్కర పరిస్థితి నుంచి బయట పడవేశారు పిళ్లై. రెండు సంపుటాల 'ఇళక్కియ ఉదయమ్' ఆయన విద్యా ప్రౌఢిమకు మచ్చుతునక. ఈజిప్షన్, బాబిలోనియన్, జూయిష్, పెర్షియన్, చైనీస్ మితాలజీలు (పురాణాలు) ఆయనకు కరతలామలకం. ఈజిప్షనుల 'రా' (సూర్యుడు) నుంచి ఆర్యుల 'రవి' శబ్దం ఉదయించిందని భాషాధ్యయన విశారదులకు తెలుసు - కాని, పామరులకు అది ఆమోదకరంగా ఉండదు. షానామా, రుబాయిత్, గులిస్తాన్, సప్తసింహాసనాలు - యివన్నీ ఆయనకు తెలుసు. భాషను పరిశుద్ధ పరచడమనే ప్రయత్నానికి ఆయన వ్యతిరేకులు. అన్యభాషా పదాలు ఎన్ని మన భాషలోకి వస్తే అంత పుష్టి - సంస్కృతం వల్ల తమిళం భాగ్యవంత మయింది. వేదాలు, బ్రాహ్మణ్యాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు, సూత్రాలు, వ్యాకరణం, వీరగాథలు, పురాణాలు, తాంత్రిక సాహిత్యం, త్రిపీఠకాలు, మహాయాన గ్రంథాలు - వీటి ప్రభావం తమిళం మీద లేకుండా ఎలా ఉంటుంది? 'ఆమె శరీరలావణ్యం వెలుగులో తడిసి, వింత రోచిస్సులు విరజిమ్ముతోంది. అమరపురి తనయ ఉషా సుందరి సమస్తమైన చీకట్లను తరిమి వేసోంది' - అంటుంది ఋగ్వేదంలోని 80 వ రుక్కు: 'కన్నడిగులు, ఆంధ్రులు, కేరళీయులు మాతృభాషతో బాటు సంస్కృతానికి ఉన్నతపీఠం యిస్తున్నప్పుడు, మనం కాదంటే నష్టపోయేది మనమే' - అన్నారు పిళ్లై ఒకసారి. అలాగే వారొక చోట, 'పాశ్చాత్య విద్యా విధానమూ వారి పద్ధతులూ, ఆంగ్ల భాషా ప్రవేశమూ మనకు బయట ప్రపంచంతో సంబంధ బాంధవ్యాలు ఏర్పరిచాయి. అంతే కాదు, క్రమానుగతంగా ఆలోచించడం నేర్పాయి. అలంకారాలు, అతిశయోక్తులుగాక నేలబారున నడవమన్నాయి. 'కజగమ్' అధర్వణ వేదంలోని 'క్లాహా'

అనే సంస్కృత శబ్దం నుంచి జనించి, అర్థవిశేషంలో అనేక మార్పులకు లోనయింది. 'గంధర్వ' అనే పదం, పారసీకుల నుంచి ఆర్యులు అప్పు తెచ్చుకున్నారు. 'ఎపిగ్రఫీ'లో (శిలా శాసన విజ్ఞానం) వైయాపురి పిళ్లై నిష్ణాతులు. శిలప్పదికారమ్, నాలాయిర దివ్య ప్రబంధం, కంబ రామాయణం - ఈ సాహిత్య సంపద సాటిలేనిది అని నమ్మిన వైయాపురి పిళ్లై, షు - కింగ్ (చైనీస్) హితవు అక్షరాలా పాటించేవారు 'మనదే తుదిమాట కారాదు. అవతలవారి అభిప్రాయం తెలుసుకోవాలి. ఆ చెప్పిన దానిలోని మంచిని గ్రహించి ఆచరించాలి'.... ఆ ప్రకారం జీవించిన ఉన్నతాత్ముడు ప్రొఫెసర్ పిళ్లై" - అని చెప్పారు ప్రేమా పాండురంగన్, 'వ్యక్తిత్వంలోని ప్రత్యేకత' వివరిస్తూ

"పదేళ్లు ప్లీడరుగా ప్రాక్టీస్ చేయడమూ, తమిళ సారస్వతాన్ని చారిత్రకంగా, పురాతత్వరీత్యా, వైజ్ఞానిక్ దృక్కోణం నుంచి వీక్షించి, ప్రాచీన కృతుల కాలనిర్ణయంలో ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి, సంస్కృత భాషలలో ఆయనకు గల పాండిత్యం, 'సైంటిఫిక్ మెతడ్' చేబట్టి, తీవ్ర పరిశోధనతో ఒక నిర్ణయానికి వచ్చేవారు. హేతుబద్ధమగు విషయ వివరణలో ఆయన అద్వితీయులు, భావవ్యాప్తి దేశకాల పరిస్థితులకు కట్టుబడి వుంటుంది గనక, సంస్కృతంలో 'పంచతంత్రం' వచ్చాకనే. 'శిలప్పదికారమ్' వెలువడి వుంటుందని ఆయన అభిప్రాయం.

సాహిత్యంలో సామ్యమూ సామీప్యత వెతకడం ఫ్రెంచి వారి పద్ధతి; జర్మనులు యిది అంగీకరించరు.... చాటువులనేవి (epigrams) గ్రీకుల కాలం నుంచీ ఉన్నాయి. తమిళంలోని చాటువులకి మూలం హాలుని 'గాథా సప్తశతి' అంటారు పిళ్లై. అక్కడా యిక్కడా కూడా ఒకే భావాంకురం జనించి వుండవచ్చునేమో! అశాస్త్రీయం కాదేమో! ఒకటి మాత్రం నిటం - తమిళ సాహిత్య సీమలో వైయాపురి పిళ్లై తొక్కిన బాట ఎందరికో మార్గదర్శకం" - అని చెప్పారు ఎ ఎ మనవాళన్ - 'ప్రతిభా వ్యుత్పత్తులు' పేర్కొంటూ.

"మనం వాడే మాటలలో మూడు తెగలు వున్నాయి: మొరటు, మృదువు, చప్పిడి (Tough Sweat, Stuffy). సంభాషణలోను, సాహిత్యంలోను ఈ వరవడే మనకు కనిపిస్తుంది. ద్రావిడ భాషలలో విశేషణాల మీద మోజు ఎక్కువ. విష్ణువుకీ మహావిష్ణువుకీ, లక్ష్మికీ మహాలక్ష్మికీ గల తేడా ఏమున్నది? కథేదో అల్లి చెప్పవచ్చు - అది వేరే విషయం. వైయాపురి పిళ్లై వాడిన పదాలు మృదువైనవి; ఇన్‌డక్టివ్ లాజికల్ మెథడ్ (మిల్) ఆయనది. ఇంగ్లీషులో సూటిగా చెబుతున్నట్టు వుంటాయి. ఆయన తమిళ వాక్యాలు" - అని ప్రొఫెసర్ పిళ్లై భాషాశైలి గురించి చెప్పారు కెపి అరవానన్. ఆ తరువాత ఆరెమ్ సుందరం 'పిళ్లై జీవితము - రచనలు' గురించి చెప్పారు. వక్తలందరూ తాము వ్రాసుకొచ్చిన పేపర్లు యింగ్లీషులో చదివారు. ఆయా అంశాలపై శ్రద్ధగా చదివి వ్రాసు కొచ్చిన వవడం చేత, మరీ పొడవైతే తప్ప, పఠన ఆసక్తి దాయకంగా సాగింది. ఆరెమ్ సుందరం పేపరు లభ్యం కాలేదు - అందుకనిఆయన ప్రసంగంలోని ప్రధానాంశం చెప్ప లేకుండా వున్నాను.

మధ్యాహ్నం మూడు గంటలకు 'తమిళభాషపై, సాహిత్యంపై పరిశోధన' అనే టాపిక్ మీద జరిగిన రెండవ సమావేశానికి ఇ. అన్నామలై అధ్యక్షులు.

"కవిత యివ్వగల ఫలం రసానందం. సాహిత్యమెప్పుడూ మనసుకి తెరిపినీ ఉల్లాసాన్ని యిస్తుంది. అందులో రెండు రకాలు వున్నాయి: ఒకటి, లోక వృత్తాన్ని తెలుపుతుంది; రెండవది శక్తిని యిస్తుంది. పొయిట్రీలో కూడా రెండు రకాలు వున్నాయి: ఒకటి, ఆత్మాశ్రయము; రెండవది గాన భరితమూ ... ఈ ప్రపంచం నిరంతరం మార్పుకి లోనవుతూ వుంటుంది; సాహిత్యమూ, సాహిత్య చరిత్ర కూడా అంతే! ఆధునిక సమాజంపై నవలకు ఎంతో ప్రభావం ఉంది. కొన్ని నవలలు పాఠకుని మనసుని పూలపరిమళంతో నింపుతాయి; కొన్ని నవలల్లోని పాత్రలు మనకు వినూత్న సత్యాలు వెల్లడిస్తూ సజీవ మూర్తులై నిలుస్తాయి - అంటారు వైయాపురి పిళ్లై. పదుత్తివంటి మేధస్సు ఆయనది.

'శిలప్పదికారమ్' చారిత్రక సంభవం కాదు, నేర్పుగా అల్లిన కథ - అంటారు. తమిళ సాహిత్యాకాశాన అయనొక ధృవతార," - అని, పిళ్లె 'సాహిత్య విమర్శ' గురించి తన పేపర్లో చెప్పారు యస్ రామలింగం.

పిఆర్ సుబ్రమణియమ్ లెక్సికొగ్రఫీ, యస్ రాజారామ్ లింగ్విస్టిక్ స్టడీస్ గురించి మాట్లాడారు. ఆతర్వాత ఎడిటింగూ - టెక్స్చ్యుయల్ క్రిటిసిజమ్ గురించిన పేపరు. "ప్రొఫెసర్ పిళ్లె ఎడిట్ చేసిన వాటిలో మొదటిది మనోన్మనియమ్. దామోదరమ్ పిళ్లె, స్వామినాథ అయ్యర్, వైయాపురి పిళ్లె - ముగ్గురూ మహోన్నత శిఖరాలు. దివ్య ప్రబంధాన్ని అయిదు సంపుటాలుగా, వేర్వేరు పదాలకు అర్థ వివరణతో వెలువరిద్దామనుకున్నారు. తగు సాక్ష్యాధారాలు లేనిదే మాతృకను సరిదిద్దకూడదని ఆయన విశ్వాసం. 1922 నాటి మనోన్మనియమ్‌తో ప్రారంభమై, కంబ రామాయణం, తిరుమంత్రం, శంక ఇలక్కియమ్, దివ్య ప్రబంధం యిలా పదహారు సాహిత్య గ్రంథాలు, 5 వ్యాకరణ గ్రంథాలు, పింగళ నిఘంటు, కైలాస నిఘంటువుతో కలిపి ఏడు నిఘంటువులు, పదిహేను ప్రబంధాలు - ఈ మొత్తమంతా ఆయన ఎడిట్ చేసినవి - అనగా పరిష్కరించినవి. ఇవిగాక అకారాది సూచకంగా తమిళ నిఘం

టువు. వెలకట్టలేని వజ్రం వైయాపురి పిళ్లై" - అన్నారు కె సుందరమూర్తి.

"సాయింత్రం ఆరు గంటలకు శంకర హాలులో, జయకాంతన్‌కి 'అగ్ని' అక్షరా అవార్డ్ - 'అగ్ని' అనగా ఆదర్స్ గిల్డ్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్.... "వేర్వేరు దేశభాషల లో వెలువడుతున్నప్పటికీ భారతీయ సాహిత్యమంతా ఒకటే - ఇండియన్ లిటరేచర్ ఈజ్ ఒన్, అని ఏనాడో చెప్పారు రాధాకృష్ణన్. ఆ ఏకత్వము ఎలాటిదంటే, కాశ్మీరు నుంచి కన్యా కుమారి దాకా, వెస్ట్ బెంగాల్ నుంచి గుజరాత్ దాకా, రాముడూ, కృష్ణుడూ, వేదాలూ పురాణాలూ, సీతా సావిత్రీ - ఈ కధలూ గాధలూ ఒకటే! ఒకటైనంత మాత్రాన మళ్లీ తేడాలు లేక పోలేదు. కంబ రామాయణం వేరు, తులసీదాసు రామాయణం వేరు - కాని, రామగాధ ఒకటే. ఏకత్వం, మళ్లీ ఆ ఏకత్వంలోనే, వైవిధ్యం. ఆ వైవిధ్యమే మన జాతికి జీవధాతువు. ఈ ఏకత్వ వైవిధ్యాల సమన్వయం అయిదువేల సంవత్సరాల చరిత్ర. భాషా సాహిత్యాలు పరస్పర మైత్రీ బంధంతో శక్తి పుంజుకుంటున్నాయి. మా కేంద్ర సాహిత్య అకాడమీకి అన్ని భాషలూ ఒకటే - ఆ భాషలో ఉత్తమ రచన అవడమే మా కొలమానం. ఈ సాయింత్రం యిందరు సాహితీకారులని యిక్కడ కలుసుకోవడం నాకెంతో సంతోషంగా ఉంది" - అన్నారు కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి ఇంద్రనాథ్ చౌధురి. శివశంకరి ఆహూతులకు స్వాగతం చెప్పారు 'ఇండియా టుడే' (తమిళ) మాలన్, 'అగ్ని' చేస్తున్న కృషి తెలిపారు. అక్షరా అవార్డ్ అందుకున్న జయకాంతన్, నేటి సాహిత్య విలువలు, తన రచనా వ్యాసంగం గురించి మాట్లాడారు.

. . . . . 26

ఉదయం సమావేశం 'అభిప్రాయ దృక్పధము - భవిష్యద్దర్శనము' - అధ్యక్షులు సి బాల సుబ్రమణియన్.

"వైయాపురి పిళ్లై 1891లో జన్మించి, 1956లో పరమపదించారు. నిఘంటు కర్త, సంపాదకులు, విమర్శకులు, అనువాదకులు, చరిత్రకారులు, భాషోత్పత్తి శాస్త్రకారులు, బహు భాషా పండితులు, కవి పుంగవులు, నవలాకారులు. వ్యాసకారులు, కథా కారులు - సాహితీ రంగంలో ఆయన స్పృశించిన శాఖలేదు. తిరువనంత పురంలోని తొమ్మిదేళ్ల న్యాయవాద వృత్తి ఆయనలోని 'లాజిక్'కి పదును పెట్టింది.... 'యుద్ధము - ప్రేమ' - ఈ రెండూ అన్ని దేశాల ప్రాచీన సాహిత్యంలోను ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. గ్రీకు, లాటిన్‌లోకి మల్లే ప్రాచీన తమిళ సాహిత్యంలో వున్నది కూడా అదే! హాలుని 'గాధాసప్తశతి' శృంగార భూయిష్టమైన ఏడు వందల చాటువులు - వాటి ప్రభావమే 'సంగమ్ లిటరేచర్' - అని వైయాపురి పిళ్లై చెప్పే అభిప్రాయంతో కొందరు ఏకీభవించటంలేదు. ఒకే

పేరుగల కవులు యిద్దరు ముగ్గురు వుండటం పిళ్లై సోదాహరణంగా చూపించారు. ఆయన చేసిన రచనా కాలనిర్ణయం ప్రకారం : సంగసాహిత్య ప్రథమ దశ క్రీ. వె. 100 నుంచి 350 దాకా ; క్రీ. వె. 400 - 500 మధ్యకాలంలో సంగ సాహిత్యం సుస్పష్టమైన రూపు తీసుకుంది ; పరిణతి దశ క్రీ. వె. 600 - 750 మధ్యకాలం. క్రీ. వె. 600 నుంచి 900 దాకా భక్తి ప్రభావం కనిపిస్తుంది. తేవారం, దివ్య ప్రబంధం, తిరువాచకమ్ - యిలాటిని ఆ టైము లోనివి. క్రీ. పూ. 150 నాటికే సంగ సాహిత్యం జనించినదనే వారి అభిప్రాయాన్ని పిళ్లై ఆమోదించలేదు. ఆ కారణంగా అయనని సాహిత్య 'ద్రోహి' అని కొందరు నిందించారు. అయితే, యిలాటివాటికి ఆయన జంకలేదు - తను నమ్మిన నిజాన్నే నిర్మొగమాటంగా చెప్పారు" - అన్నారు విజయదేవన్ 'సంగ సాహిత్యం' గురించి చెబుతూ,

"అధునిక సాహిత్య విమర్శకు పితృసమానులు వైయాపురి పిళ్లై.... సంగ సాహిత్యంలో లేని పదాలు తిరువళ్లువార్ వాడారు. సంస్కృతం లోని ఏకాంతం 'ఒరు వంతమ్' (ఒంటరి తనం) అని తమిళంలో వాడారు ; అలాగే 'భాగ్యం' అనే

మాట. సంస్కృత ప్రభావం లేదంటే ఎలా కుదురుతుంది? 'అసరకొ్కవై'కి మాతృక 'శక్రస్మృతి'. 'తిరుకడుగమ్' అనే వైద్యగ్రంథానికి మూలం సుశ్రుతము, అష్టాంగ హృదయమూను (ఎండబెట్టిన అల్లం, మిరియం, తోక మిరియం - ఈ మూడూ ఆయా పాళ్లా పద్ధతుల్లో ఎన్నో వ్యాధులు నివారించగలవనీ, ఆరోగ్యదాయకములనీ, నమ్మేవారు). అలాటిదే ఏలకులలోని ఔషధగుణం. శబ్దపరిశీలనలో - (అంటే పదముల పుట్టుక, పెరుగుదల) పిళ్లైకి సాటి మరొకరు లేరు,'' - అన్నారు ఆర్ చంద్రశేఖరన్.

''కాల నిర్ణయం విషయంలో వైయాపురి పిళ్లై పాశ్చాత్య పద్ధతి (వెస్టరన్ మెథడాలజీ) అవలంబించి, అన్ని తమిళ కావ్యాలూ ఏ ఏ శతాబ్దాలకు చెందినవో, తర్కప్రమాణంతో తేల్చి చెప్పారు. పెరియపురాణమ్ అనగా భక్తాగ్రేసరుల జీవితగాథలు; కోవిల్‌పురాణమ్ - ఆయాక్షేత్రాలకు చెందిన స్థల పురాణం. ప్రాచీన వీర గాథల తర్వాత, కృష్ణుని కథలు విరివిగా కనిపిస్తాయి. హైందవ ప్రభావం ఎదుర్కొనేందుకు, బౌద్ధులు, జైనులు తమ ప్రచార గాథలు వ్యాప్తి చేశారు. - ఆ విధంగా సంస్కృత, పాలీ సాహిత్యాలు ప్రవేశించాయి. 'పెరుంకదై' - గుణాఢ్యుని 'బృహత్కథ' - జైనులది. 'మణిమేఖలై'లో బౌద్ధ ప్రచారం కనిపిస్తుంది. జైనుల రచనలు కావ్యాగాన సుధలుగా పేర్కొనవచ్చు. 'శివజ్ఞ చింతామణి' ఈ కోవలోనిదే. 'కుంతలకేశి' బౌద్ధ రచన. కంబ రామాయణం వాల్మీకి రామాయణాన్ని మించిపోయింది కొన్ని చోట్ల. వైయాపురి పిళ్లై లెఖ్ఖ ప్రకారం కంబరామాయణం 12వ శతాబ్దానిది; కాని, మీనాక్షి సుందరం, అరుణాచలం వంటివారు, 9వ శతాబ్దాని దని అంటారు. 'పెరియ పురాణం'లో ఉండేది శివభక్తుల గాధలు.... తన జీవితమంతా తమిళ సాహిత్య పరిశోధనకు అంకితం గావించిన వైయాపురి పిళ్లై ధన్యులు'' - అన్నారు వీరమణి, తమిళ సాహిత్యపు లోతులు తరిచి చెబుతూ.... పి. శౌరిరాజన్ 'తమిళ సాహిత్య పునర్వికాసం' గురించి మాట్లాడారు. ఆ పేపరు దొరకలేదు.

మధ్యాహ్నం రెండు గంటలకు ప్రారంభమైన చివరి ప్రధానాంశం: తమిళ సాహిత్య చరిత్ర. పెరియ కరుప్పన్ సంగ సాహిత్య క్రమానుగత వివరణ తెలిపిన మీదట, 'కాల నిర్ణయం గురించిన వాదోపవాదాల' మీద ప్రసంగం. ''ప్రాచీన తమిళ సాహిత్యంలో కావ్య గీతికలు, దీర్ఘ కవితలు కనిపిస్తాయి. క్రీ.వె. రెండవ శతాబ్దికి పూర్వం సంగమ్ లిటరేచరే లేదని పిళ్లై అభిప్రాయం. శిలా శాసనాల పరిశీలనానంతర ఆయన కొన్ని నిర్ణయాలకు వచ్చారు - బాగానే వుంది. కాగా, బ్రాహ్మీ లిపి నుంచి తమిళ లిపి జనించడాన్ని ఎవరూ కాదనలేరు. అది సర్వజనామోదకం. పోతే, లిపి పుట్టడానికి పూర్వం సాహిత్యం వుండ.

# కేంద్ర సాహిత్య అకాదెమీ



## కొత్త ప్రచురణలు

| | | |
|---|---|---|
| ☐ | వెయ్యినొక్కరాత్రులు (అరేబియన్ నైట్స్)<br>—అనువాదం : ఘండికోట బ్రహ్మాజీరావు | రు. 80 |
| ☐ | కలకత్తాకి దగ్గరలో (బెంగాలీ నవల)<br>—గజేంద్ర కుమారమిత్రా. అనువాదం : మద్దిపట్ల సూరి | రు. 50 |
| ☐ | రొయ్యలు (మళయాళీ నవల)<br>—తగళ శివశంకర పిళ్ళై. అనువాదం : జి. సుబ్బరామయ్య | రు. 40 |
| ☐ | ఉమ్రావ్ జాన్ అదా (ఉర్దూ) - మీర్జా రుస్వా<br>అనువాదం : డి. రంగచార్య | రు. 30 |
| ☐ | కలసిన జీవితాలు (బహుమతి పొందిన గుజరాతీ నవల)<br>—పన్నాలాల్ పటేల్. అనువాదం : వి. ఆంజనేయశర్మ | రు. 40 |
| ☐ | భవిష్యత్తు! బహుపరాక్! (పంజాబీ నవల)<br>—నరేంద్రసింగ్. అనువాదం : వి.వి.బి. రామారావు | రు. 60 |
| ☐ | తమిళ సాహిత్య కథలు<br>—అరుణాచలం. అనువాదం : చల్లా రాధాకృష్ణశర్మ | రు. 40 |
| ☐ | తెలుగు కథ (సం : డి. రామలింగం) | రు. 50 |
| ☐ | కబీరు వచనావళి<br>—అనువాదం : పుట్టపర్తి నారాయణాచార్యులు | రు. 40 |
| ☐ | తెలుగు కావ్యమాల (సం : కాటూరి వెంకటేశ్వరావు) | రు. 40 |
| ☐ | భాసుడు - వి. వెంకటచలం<br>—అనువాదం : పుల్లెల శ్రీరామచంద్రుడు | రు. 40 |

## భారతీయ సాహిత్య నిర్మాతలు

☐ అన్నమాచార్యులు ☐ సరోజినీ నాయుడు ☐ రాజా రామ్ మోహన్ రాయ్ ☐ నజ్రుల్ ఇస్లామ్ ☐ ఎ. ఆర్. రాజరాజవర్మ ☐ హరి నారాయణ ఆప్టే ☐ ఉ. వే. స్వామినాథ అయ్యరు ☐ ధర్మవరం రామకృష్ణమాచార్యులు ☐ గురజాడ ☐ మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్ ☐ గాలిబ్.... (ఒకొక్క ప్రతి వెల రు. 15/-)

## సాహిత్య అకాదెమీ

న్యూఢిల్లీ - 1, కలకత్తా-53, బొంబయి-14, బెంగుళూరు-2.

దక్షిణ ప్రాంతీయ కార్యాలయం : 103 జెసిరోడ్డు, బెంగుళూరు-560 002.

కూడదా? అనోటా అనోటా పాడు కుంటూ, తరతరాలుగా వస్తున్నది సాహిత్యం కాదా? అనుశ్రుతంగా వస్తున్నదాని నుంచే కదా లిఖిత సాహిత్యం జనించేది? వేదాలు ఎలా వ్యాప్తమయాయి? గురు శిష్య పరంపర నుంచి గాన స్రవంతిలా! సంగ సాహిత్యం కూడా ప్రారంభంలో కంఠోపాఠంగా వ్యాప్తి నొందిందేమో! వారెంతకీ రాజుల ఆస్థానాలు, యుద్ధ భూమిలోని క్షాత్రం గురించే కవిత ల్లారు. సంగ సాహిత్య ప్రాచీన కవితలపై సంస్కృత ప్రభావం ఉన్నట్టు తోచదు," అన్నారు కె మహదేవన్.

"ఎపిక్ అనే మాట గ్రీకులోని 'ఎపోస్' నుంచి వచ్చింది - అనగా శ్రావ్యంగా పాడే పాట. కాలగతితో అర్థం మారిపోయింది.... వైయాపురి పిళ్లె మహావృక్షం వంటి వ్యక్తి. ఇంగ్లీషులోని 'ఎపిక్' తమిళంలో 'కావ్యం' అయింది. 'ఇతి-హా-ఆస' అనగా 'సంభవించినది' అని అర్థం. వేర్వేరు సంభవాలే ఆ ప్రజకు సంస్కృతి అవుతాయి. శిలప్పదికారమ్ రచించిన ఇలాంగొ, నాటకం చివరి దృశ్యంలో కావ్యం చెబుతున్న కథకునిగా దర్శనమిస్తాడు. మణిమేఖలై రచయిత మహాయాన బౌద్ధుడు - బ్రాహ్మనిజమ్, జైనిజమ్‌ల మీద విసుర్లు వుంటాయి. జైనులు వ్రాసిన వనేకం కాలగర్భంలో కలిసిపోయాయి - చింతామణి, శూలమణి వంటివి మాత్రం మిగిలాయి.... జీవగన్‌కి ఎనమండుగురు భార్యలు. అతని శృంగారకేళి ఎంతో రసవత్తరంగా వర్ణిస్తాడు కవి. చివరికారాజు భోగ భాగ్యాలు అర్థరహితమూ, అశాశ్వతమూ అని తెలుసుకు, విరాగి అయి ఆ వైరాగ్యం ద్వారా జీవన్ముక్తుడవుతాడు. వాసుదేవులకు, ప్రతివాసుదేవులకి చెందిన గాథ 'శూలమణి' వృత్తాంతం. తమిళంలో అయిదు మహాకావ్యాలు, అయిదు సాధారణ కావ్యాలూ వున్నాయి. హెూమర్, వర్జిల్, వాల్మీకి, కాళిదాసులకు తీసిపోడు కంబన్" - అన్నారు ఎ పాండురంగన్.

"వైయాపురి పిళ్లె 16 సంవత్సరాలు మద్రాసు యూనివర్సిటీలో రీడరుగా పని చేశారు - ఆ రోజుల్లో ప్రొఫెసరు అవటం అంత 'తేలిక' కాదు. అశోకుని కాలం నాటి బ్రాహ్మీ లిపి నుంచి, ఆనాటి శాసనాల లిపి నుంచి, మిగతా భారతీయ భాషల లిపులు ఆవిర్భవించాయి. పండితులు వొప్పుకున్నా వొప్పుకోక పోయినా, సంస్కృత ప్రభావం మన దేశభాష లన్నింటి మీదా ఉంది. బ్రాహ్మీనిజమ్, బుద్ధియిజమ్, జైనిజమ్ - ఈ మూడు మత ప్రభావాలూ మన సారస్వతంపై పుష్కలంగా వున్నాయి - అంతే కాదు, అనేక పారశీక పదాలు, ఆ తర్వాత ఆంగ్ల పదాలు సాహిత్యంలోను, జీవితంలోను చోటు చేసుకున్నాయి. భాష అనేది నిరంతరం పారే జలవాహిని - కదలికలేని నీటి గుంట కాదు. కాల గతితో శబ్దాలు తీసుకొనే రూపు రేఖలు తరిచి చూసిన

కొద్దీ తమాషాగా ఉంటుంది. క్రీ. పూ. 5వ శతాబ్దినాటి 'చుప్పు' యిప్పుడు 'ఉప్పు' అయింది. సంస్కృత 'శ్రేణి' తమిళంలో 'ఎణి'; అలాగే 'సహస్రం' - 'ఆయరం' శ్రావణి - శవణి - ఆవణి. చేతును - చేయుదును - ఆ 'ద' అక్షరం -'మీరుద చేస్తురు' వంటిది. ఇంగ్లీషులోని Ploghu, మనకి తెలుగులో 'నాగలి' - 'నాగలి' అని కొన్ని జిల్లాలలో అంటారు. 'నాగేలు' అని మరి కొన్ని జిల్లాలలో; 'మడికె' అంటారు రాయలసీమలో; ఆదిలాబాద్‌లో 'నాంగలి' - అంటారు. అందరూ మాట్లాడేది తెలుగే. కాని, ఒకే వస్తువుని నాలుగు రూపాలలో పిలుస్తున్నారు. ప్రతి భాషకీ యిరుగు పొరుగు భాషల సంపర్కం విధిగా ఉంటుంది - ఏ భాషా మడిగట్టుకు కూచోలేదు. అన్య భాషా పదాల వల్ల స్వభాష మరింత వృద్ధి చెందుతుంది. భాష ఎప్పుడూ ప్రజల నుంచి, ప్రజల జీవితావసరాల నుంచి జన్మించి, కవి పండితుల పోషణలో, పెరిగి పెద్దదై సాహిత్య సౌరభం వెదజల్లుతుంది," - అన్నారు భద్రిరాజు కృష్ణమూర్తి, - ముగింపు ఉపన్యాసంలో. సాహిత్య అకాడమీ బెంగుళూరు కార్యదర్శి ఎ కృష్ణమూర్తి, ఈ రెండు రోజుల విద్వద్గోష్ఠిలో పాల్గొన్న వారికి, విన డానికి వచ్చిన వారికి వందన సమ ర్పణ గావించారు.

. . . . . 30

"ప్రఖ్యాత వారపత్రిక 'బ్లిట్జ్' డెప్యూటీ ఛీఫ్ ఎడిటర్‌గా మిత్రులు సాయినాథ్ పత్రికా రంగంలో తన దైన వరవడి ఏర్పరుచుకు, అబ్బాస్ 'లాస్ట్ పేజ్'కి యింతకు మించిన వారసులెవరు? - అనిపించుకున్నారు. అబ్బాస్ ఈయనపై వుంచిన నమ్మ కాన్ని పాఠకలోకానికి ధృవపరిచారు. సాయినాథ్ కలంలో సెన్సేషనిలజమ్ లేదు; పరిశోధనా పద్ధతి కూడా సహేతుకమూ సందర్భోచితమూను. పత్రికా స్వాతంత్ర్యాన్ని, పత్రికలు తాము అనుకున్న రీతిలో సాధించ గలుగుతున్నాయా? దేశం లోపల గాక, దేశం వెలుపల ఏమాదిరి వొత్తి డులు వుంటున్నాయి? ప్రింట్ మీడి యాకు పరిపూర్ణమైన స్వాతంత్ర్యం ఉన్నదా? ఇటువంటి విషయాలు, హిరోషిమా నుంచి, మొన్నటి గల్ఫ్ వార్ దాకా సాయినాథ్ వివరించ మన్నారు" అంటూ ముఖ్య అతిధిని పరిచయం చేశారు 'ఫ్రంట్‌లైన్' ఎడిటర్ రామ్. మద్రాసులోని 'ఇండియన్ స్కూలు ఆఫ సోషల్ సైన్సెస్' వారు, లోకల్ లైబ్రరీ అథారటీ వారి హాలులో ఈ సమా వేశం ఏర్పాటు చేశారు. సుమారు మూడు వందల మంది వచ్చారు. గల్ఫ్‌వార్‌లోని ప్రాపగాండా ధోరణి వివరించే స్లయిడ్స్ కూడా చూపారు సాయినాథ్. ప్రధాన విషయం: హిరోషిమా నుంచి గల్ఫ్‌వార్ దాకా

- మీడియా, మిలిటరిజమ్ (Hiroshima to the Gulf War - The Media and Mialtarısm)

"ఆగస్టు ఆరో తేదీన హిరోషిమా మీద అణుబాంబు వేసిన పద్దెనిమిది గంటలకు, తాము ఆ బాంబుని గాలిలో పేల్చామనీ, రేడియేషన్ ప్రమాదం ఉండబోదనీ అమెరికన్ మిలటరీ ప్రకటించింది - అది శుద్ధా బద్ధం; నగరం పూర్తిగా ధ్వంస మయింది; లక్షమందికి పైగా మరణించారు; ఇప్పటికీ జపాన్‌లో సాలీనా ఇరవైవేల మంది రేడియేషన్ వల్ల మృతులవుతున్నారు. మూడు రోజుల తర్వాత నాగసాకిం మీద వేసిన రెండవ యాటమ్‌బాబు కథ యింకా విచిత్రమైనది. పైలట్‌కి ఆ బాంబు ఎక్కడ జారవిడవాలో, ఆ సైనిక స్థావరం గుర్తులన్నీ చెప్పారు - ప్లాను యిచ్చారు. అయితే ఆ నాడు మేఘాలు దట్టంగా ఉండటంవల్ల యుద్ధ విమానం మబ్బులలో యిరుక్కుపోయింది. - ఇరవై నిము షాల పాటు ఆ మేఘాల్లో ఎగిరి, సైనికస్థావరం గుర్తించలేక, ఎక్కడో ఒక చోట అని జారవిడువగా, అది 'నాగసాకి'. అక్కడ రెండవ బాంబు వేయమని సైనికాధికారులు ముందు చెప్పలేదట; కాని, అయిపోయాక తమ ఆదేశ ప్రకారమేనని అన్నారు. ఇది బయటికి పొక్కదా, ప్రజలకు తెలియదా ? - అని అమాయకులు అనుకుంటారు. తెలియదు, తెలియగల అవకాశం లేదు. మీడియాని మిలిటరీ శాసిస్తుంది; రాజు చెప్పినదే న్యాయంలా మిలటరీ చెప్పినదే నిజం. వ్రాత బల్లల ముందు కూచుని జీవితం గడిపే జర్నలిస్టులు, యూనిఫారమ్ ధరించి యుద్ధరంగంలోకి వెళ్లగానే, తామేదో పొడిచేస్తున్నామనుకుంటారు. బుద్ధి కుశలత, వ్యవహార నైపుణ్యం గల సైనికాధికారులు, వీరికి ఎంత చెప్పదలుచుకున్నారో, అంతే చెబు తారు. ఇబ్బందికరమైన ప్రశ్నలు వేస్తే, నయానా భయానా ఊరుకోబెట్టడం, వెన్నతోబెట్టిన విద్య. రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటి పసిఫిక్ రంగంలోకి కొన్ని వందల మంది అమెరికన్ జర్న లిస్టులు వెళ్లారు; అందులో నూట నలభైమంది, అణుప్రమాదం తర్వాత జపాన్‌ని స్వయంగా చూశారు. 'బెతొవిన్ సింఫనీలో'ని చివరి చరణ మన్నాడు ఒక జర్నలిస్ట్; కొన్ని లక్షల మంది సామాన్యులు - ఈ యుద్ధాలు ఎందుకు చేస్తారో, ఎందుకు జరుగుతాయో తెలియని మూక ప్రజా నీకం - దారుణమూ, కిరాతకమూ, అమానుషమూ అయిన మరణానికి లోనైనప్పుడు, వారికి గల సమస్తం తుడిచిపెట్టుకు పోయినప్పుడు, అందులో సంగీత స్రవంతి వినిపించ డం ఎంతటి దౌర్భాగ్యం.... ప్రపంచ నాయకులందరూ, అణుశక్తి ఉత్పాద నలో శ్రమించిన సైంటిస్టులతో సహా, అమెరికా జరిపిన ఈ కిరాతక చర్యని గర్హించారు. ప్రజాభిప్రాయ సేకరణకు అమెరికాలో 'ఒపీనియన్ పోల్స్' వున్నాయి. 'జపాన్‌పై అటం

బాంబు వేయడం రైటా, తప్పా?' అన్న ప్రశ్నకు 80 శాతం అమెరిక నులు 'రైటు' అన్నారు; 5 శాతం తమకు ఎటువంటి అభిప్రాయమూ లేదన్నారు; 10 శాతం మాత్రం 'తప్పు' అని చెప్పారు. అమెరికాలోని అన్ని పత్రికలూ, మిలటరీ చెప్పినదే చిలవలూ పలవలూతో వర్ణిస్తూండగా 'న్యూయార్క్ టైమ్స్'కి చెందిన విలియమ్ లారెన్స్, సైంటిస్టులను సంప్రదించి కొత్తదారి తొక్కాడు; ఉత్తరోత్రా పులిట్జర్ బహుమతికి అర్హుడయాడు. వాటర్ లిప్‌మాన్ వంటి ప్రముఖులు సైతం మిలటరీ కథనానికి తలవొగ్గక తప్పలేదు. యుద్ధశాఖ రక్షణశాఖగా మారింది తప్పితే అమెరికాలోని మీడియాని శాసిస్తున్నది మిలటరియే! అంతేకాదు, శాటిలైట్ విజ్ఞానం, ప్రపంచ సమాచార వ్యాప్తిలో, అమెరికాకు ఒక విధంగా గుత్తాధిపత్యాన్ని యిస్తోంది. 90 శాతం ప్రసార సంస్థలు, ప్రసార సాధనాలు వారి చేతుల్లో వున్నాయి.

"ఇక, గల్ఫ్‌వార్ దగ్గర కొద్దాం. సదామ్ హుస్సేన్‌ని గోముగా దువ్వి, యింతవాణ్ణి చేసినది పాశ్చాత్య ప్రభుత్వాలే; 1984లో అతను రసాయనాయుధాలు (కెమికల్ వార్) ఉపయోగించినప్పుడు, రాక్షసుడు కాలేదు. 1990 ఆగస్టు 2వ తేదీన ఇరాక్ కువాయిత్‌పై దురాక్రమణ జరిపింది; కాని, ఆ సంవత్సరం జనవరి నుంచి 'ప్రాపగాండా వార్' ప్రారంభమై, సదామ్ హుస్సేన్ 'హిట్లర్' అయాడు. అతని రహస్య స్థావరం కట్టించినది పశ్చిమ జర్మనీ – అమెరికాకు తెలియకుండా జరిగిందా అదంతా! ఒక కోటీ ఎనభై లక్షల జనాభా గల దేశం, అమెరికా గట్టిగా కళ్లు తెరిచి, అదిలిస్తే నిలవగలదా? సూపర్ పవర్ ముందు ఇరాక్ త్రాణ ఎంత? అయితే, పాశ్చాత్య దేశాలకు యుద్ధక్రీడ ఒక వినోదమై పోయింది. బాగ్దాద్ నగరం పై బడ్డ బాంబుల మంటలు జులై నాలుగు నాటి (అమెరికా స్వాతంత్ర్య దినోత్సవం) బాణాసంచాని (తూటాలు, మతాబులు, చిచ్చుబుడ్లు వగైరా) గుర్తు చేశాయట ఒక జర్నలిస్ట్‌కి – ఎంత గొప్ప ఉపమానం. అది హర్షించే జనావళి నైతిక పతనం విచారకరమైనది. సాంకేతిక యుద్ధంలో పొరబాట్లు జరగవనుకుంటారు – కాని, పదింట మూడువంతులు అక్కడా జరుగుతాయి. మీడియాపై మిలటరీకి గల పెత్తనం పూర్తిగాపోయి, ఐక్యరాజ్యసమితి హస్తాలకు బలం చేకూరిస్తే తప్ప, ఈ పరిస్థితులు బాగుపడవు" – అన్నారు సాయినాథ్. అన్నిటికీ అమెరికానే తప్పుబట్టడమేమిటనే అభిప్రాయం కొందరు శ్రోతలలో కలగవచ్చు. కాని, సూపర్ పవర్ అయిన అమెరికా తనకు అనుకూలమైనదే, యావత్ప్రపంచానికీ ఆమోదకరం కావాలని అనుకోవడం వల్ల, సైనిక దృష్ట్యా సమస్తం చూడటం వల్ల, పత్రికా స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లుతోందనీ న్యాయం చేకూరడం లేదనీ సాయినాథ్ దృక్పథం.

—యన్నార్ చందూర్

# చిత్రజగతి సమీక్ష

## నరసారెడ్డి
## చిన రాయుడు

తండ్రికి (పెదరాయుడు) తగ్గ తనయుడు, జోడెద్దుల పెట్టె బండిలో, తీర్పు చెప్పడానికి వస్తున్నాడంటే, ఊరంతా కళ్లు చేసుకు చూస్తూ వుంటుంది. చక్కటి మీసకట్టు, నిండైన విగ్రహం, అడ్డకట్టు, అరచేతుల షర్టు, బుజం మీద రుద్రాక్షంచుల కండువా, ఆ సౌమ్య మూర్తి జంకు గొంకులు లేకుండా తీర్పు చెప్పగల సమర్థుడు, సచ్చరితుడు అనిపిస్తుంది. వివాదమేమిటంటే, ఆ పంట పొలం దేవాలయానిది కాదు, వీలునామా ప్రకారం తనకి చెందవలసి వుంది - అని అంటుంది ఒకామె. అది దేవుని భూమి అంటాడు ధర్మకర్త. తన వద్దనున్న వీలునామా చూపిస్తుంది ఫిర్యాదు తెచ్చినావిడ. ఆ పత్రం నిశితంగా పరిశీలించి, 'యిది దొంగ విల్లు - మనిషి చనిపోయిన ఆరు నెలలకు పుట్టించిన విల్లు. అందరికీ తెలిసిన నిశానీదారు - యిందులో సంతకం పెట్టాడు. ఇలాటి మోసాలు యికముందెప్పుడూ చేయవద్దని ఆమెని హెచ్చరిస్తూ, పొలం దేవుడి గుడికే చెందాలని తీర్పు చెబుతున్నాను' - అంటాడు చినరాయుడు. తన అక్క చనిపోగా, బావగారు వుంచుకున్న మనిషిఆ టక్కులాడి.... 'బుల్లి పిట్ట, బుజ్జి పిట్ట - గూటిలోని గువ్వ పిట్ట' లాటి గౌరి (విజయశాంతి), బొంగరాలాటలో ఓడిపోయి, తన పొట్ట మీద బొంగరం తిప్పించుకున్న గౌరి, 'ఆకాశమంత మనసున్న రాజు - పండు వెన్నెలలాటి చల్లనిరేడు' అయిన చిన రాయుడు వద్దకు తీర్పుకి వచ్చినప్పుడు, 'చేసిన అప్పు చెల్లించక తప్పదు - చదివింపుల విందు చేసి తీర్చు' - అంటాడు. చెల్లెలు గంగ చదువు కోసం చేసిన అప్పు అది. అవమాన భారంతో కుంగిపోతూ ప్రతి యింటికీ వెళ్లి పిలుస్తుంది. విందు భోజనం చేసినవారు, ఋణ గ్రస్తురాలిని ఆదుకునేందుకు ఆకు కింద, తమకి తోచిన సొమ్ము వుంచి వెళ్తారు - గౌరవంగా ఆదుకోవడమన్న మాట. చిన రాయుడు తను తిన్న ఆకు కింద మంగళ సూత్రాలు వుంచుతాడు. అక్కడితో కథ పూర్తి కాలేదు - పరుచూరి బ్రదర్స్ మరి కొన్ని మలుపులు పెట్టారు. దర్శకత్వం : గోపాల్. విజయశాంతి అల్లరి, వెంకటేష్ నటనా కౌశలం ప్రేక్షకుల నాకట్టుకుంటాయి. నిర్మాత : నరసారెడ్డి.... పిఆర్ఒ : జగన్.

JAGATI Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004